# చారిత్రక అసత్యాలు చాలించండి

**- దేవులపల్లి ప్రభాకర రావు**

**యు**పిఎ ప్రకటించిన కనీస ఉమ్మడి కార్యక్రమంలో తెలంగాణ నిర్మాణం అంశంగా చోటు చేసుకొంది. పార్లమెంటు ఉభయ సభల సంయుక్త సమావేశంలో రాష్ట్రపతి ఎపిజె అబ్దుల్‌కలామ్ తెలంగాణ రాష్ట్ర అంశాన్ని ప్రస్తావించారు. మొదట 2004 మే 27న యుపిఎ ప్రకటించిన కనీస ఉమ్మడి కార్యక్రమంలో "చర్చలు, ఏకాభిప్రాయసాధన ద్వారా తెలంగాణ" అని ఉంది. తరువాత కేంద్రమంత్రివర్గం ఆమోదించిన కనీస ఉమ్మడి కార్యక్రమంలో,రాష్ట్రపతి ప్రసంగంలో, ప్రధానమంత్రి మన్‌మోహన్‌సింగ్ మొదటి పత్రికాగోష్ఠిలో తెలంగాణ అంశాన్ని ప్రస్తావించినప్పుడు 'ఏకాభిప్రాయ సాధన' అనే మాట లేకపోవడం గమనార్హం. కాంగ్రెస్‌పార్టీ, తెలంగాణ రాష్ట్ర సమితి మధ్య పొత్తు కుదిరినప్పుడు కాంగ్రెస్ పార్టీ తెలంగాణ రాష్ట్ర నిర్మాణంపై మొదటి ఎస్‌ఆర్‌సి (ఫజులలీ కమిషన్) సిఫార్సును గౌరవిస్తూ రెండవ ఎస్‌ఆర్‌సి నియామకానికి అంగీకరించింది. అయితే, కనీస ఉమ్మడి కార్యక్రమంలో, రాష్ట్రపతి ప్రసంగంలో, ప్రధానమంత్రి పత్రికాగోష్ఠిలో రెండవ ఎస్‌ఆర్‌సి ప్రస్తావన లేదు. రెండవ ఎస్‌ఆర్‌సి లేకుండానే గత ముప్పై సంవత్సరాలలో పదికొత్త రాష్ట్రాలు అవతరించాయి.

కాంగ్రెస్ అధిష్ఠానం వైఖరి స్పష్టంగా, గోప్యత లేకుండా ఉన్నట్టయితే వివాదాలకు ఆస్కారం ఉండదు.కాని, గడచిన పన్నెండుమాసాలలో తెలంగాణ సమస్యపై కాంగ్రెస్ అధిష్ఠానం ఎన్నడూ తన వైఖరిని, విధానాన్ని స్పష్టం చేయలేదు. అందువల్ల, రాష్ట్ర కాంగ్రెస్ నేతలు, తెలంగాణ రాష్ట్రసమితి నాయకులు ఎవరికి తోచినరీతిలో వారు ప్రకటనలు చేస్తున్నారు. తత్ఫలితంగా వివాదాలు, వాగ్యుద్ధాలు చెలరేగుతున్నాయి.



సోనియాగాంధిదే అంతిమ నిర్ణయం, ఎవరూ ఏమీ మాట్లాడవద్దు అని అంటున్ననేతలే విపరీతంగా మాట్లాడి కవ్విస్తున్నారు. సమస్యలను చాపకిందికి నెట్టి పరిష్కారాలను వాయిదావేయడం కాంగ్రెస్ సంస్కృతి. పరిస్థితి విషమించే వరకు చేతులు ముడుచుకొని జాప్యం చేయడం కాంగ్రెస్ నాయకుల అలవాటు. కనీస ఉమ్మడి కార్యక్రమం ప్రకటించిన తరువాత ఆరునెలలకు, తెలంగాణ రాష్ట్ర సమితి నాయకులు (ఇద్దరు కేంద్రమంత్రులు) ఒత్తిడి తీసుకురావడంతో తెలంగాణ డిమాండ్ పరిశీలనకు యుపిఎ ఒక సబ్ కమిటీని గత నవంబర్‌లో నియమించింది. పదిహేను రోజులలో సబ్ కమిటీ వివిధ పక్షాల (ముఖ్యంగా యుపిఎ పక్షాల, యుపిఎకు బయటి నుంచి మద్దతునిస్తున్న వామపక్షాల) అభిప్రాయలను సేకరించి నివేదికను సమర్పించగలదని మొదట అన్నారు. నవంబర్ నుంచి ఏప్రిల్ వరకు సబ్‌కమిటీ మేల్కొలేదు. తిరిగి తెలంగాణ రాష్ట్ర సమితి నాయకులు ఒత్తిడి తేవడంతో సబ్‌కమిటీ ఏప్రిల్ 15వ తేదీన ఎట్టకేలకు మొదటి సమావేశం జరిపింది. ఈ సమావేశంలో దయానిధి మారన్ పాల్గొనలేదు. సబ్ కమిటీ తిరిగి ఎప్పుడు సమావేశమవుతుందో తెలియదు. ఇంత నాన్ సీరియస్‌గా పనిచేసే కమిటీ బహుశా ఇంకేదీ ఉండదు. మొత్తానికి తెలంగాణ రాష్ట్రం డిమాండ్‌పై ఆయా రాజకీయపక్షాల అభిప్రాయాలను కోరుతూ సబ్ కమిటీ లేఖలు పంపింది.

**భాషే కీలకం కాదు**

భాషా రాష్ట్రాల విభజనకు, చిన్న రాష్ట్రాల ఏర్పాటుకు తాము వ్యతిరేకమని సిపిఐ(ఎం) నాయకులు అంటున్నారు. అది వారి అభిప్రాయం, 'దివాంధములు శపించిన దినకరుడుదయించడా' అని ఒక కవి అన్నారు. దేశంలో హిందీభాషా రాష్ట్రాల సంఖ్య పది దాటింది. ఒక భాషకు ఒకే రాష్ట్రం ఉండాలని భారతరాజ్యాంగం నిర్దేశించలేదు. నిజానికి జవహర్‌లాల్ నెహ్రూ, సి.రాజగోపాలచారి, మౌలానా అబుల్‌కలామ్ అజాద్ భాషా ప్రాతిపదికన రాష్ట్రాల నిర్మాణాన్ని వ్యతిరేకించారు. అయినా, వారు తరువాత ప్రజాభిప్రాయాన్ని, ప్రజల వాంఛలను గౌరవించారు. రాష్ట్రాల పునర్నిర్మాణానికి భాష ఒక్కటే ప్రాతిపదిక కారాదని, పరిపాలనా సౌలభ్యం, ఆర్థిక పటిష్ఠత, సామాజిక స్థితిగతులు, చారిత్రక – సాంస్కృతిక నేపథ్యం తదితర అంశాలను కూడా పరిగణలోకి తీసుకోవాలని 1948లో థార్ కమిటీ అభిప్రాయపడింది. ఈ అభిప్రాయంతో జెవిపి (జవహర్‌లాల్, వల్లభాయ్ పటేల్, పట్టాభి సీతారామయ్య) కమిటీ ఏకీభవించింది. రాష్ట్రాల పునర్నిర్మాణానికి భారత ప్రభుత్వం 1954లో ఫజులలీ అధ్యక్షుడుగా, హృదయనాథ్ కుంజ్రూ, సర్దార్ కె.ఎం. పణిక్కర్ సభ్యులుగా నియమించిన మొదటి ఎస్‌ఆర్‌సికూడా ఇదే అభిప్రాయాన్ని వ్యక్తపరచింది. భాషతోపాటు ఇతర అంశాలను కూడా పరిశీలించి నందువల్లనే ఫజులలీ కమిషన్ తెలంగాణ, విదర్భ రాష్ట్రాల ఏర్పాటుకు సహేతుకంగా సిఫారసు చేసింది. దాదాపు ఎనిమిదికోట్ల జనాభా

గల ఆంధ్రప్రదేశ్ రేపు పదిహేనుకోట్ల జనాభాగల రాష్ట్రమయితే పరిపాలనా సౌలభ్యం, సామర్థ్యం లోపించడంతో పాటు అనేక సామాజిక, ఆర్థిక అనర్థాలు సంభవించవచ్చు. ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్, రాజస్థాన్, బీహార్ ఏకభాషా రాష్ట్రాలయినప్పటికి, చాలా పెద్ద రాష్ట్రాలయినా అభివృద్ధిలో అట్టడుగున ఉన్నాయి.

1953 అక్టోబర్‌లో కర్నూలు రాజధానిగా అవతరించిన ఆంధ్రరాష్ట్రం జనాభా ఇప్పటి తెలంగాణ జనాభా కంటె తక్కువ. ఒక సమగ్రరాష్ట్రంగా అవతరించడానికి ఆ రోజు ఆంధ్రప్రాంతానికి ఉన్న అర్హతలు అన్నీ ఈరోజు తెలంగాణకు ఉన్నాయి. ప్రకృతి వనరులు, సహజసంపదలు, జలనిధులు, గనులు తెలంగాణలో అపారం. ఆంధ్రప్రదేశ్‌లో  కృష్ణా, గోదావరి నదుల పరీవాహక ప్రాంతంలో 70 నుంచి 80 శాతం భాగం తెలంగాణలో ఉంది. ఈ రెండునదుల పరీవాహక ప్రాంతంలో (ఆంధ్ర ప్రదేశ్‌లో) సేద్యానికి అనువయిన సారవంతమైన భూమిలో 70శాతం కంటె ఎక్కువ భాగం తెలంగాణలో ఉంది. అయినా, కృష్ణా, గోదావరి జలాలలో న్యాయమయిన వాటా తెలంగాణ ప్రాంతానికి లభించడంలేదు. దక్షిణ భారతదేశంలో అన్నింటికంటె పెద్దబొగ్గు గనులు తెలంగాణ నిధులు. గ్రానైట్, సున్నపురాళ్ళు తదితర ఖనిజాల సంపద తెలంగాణలోనే అధికం. ఆంధ్రప్రదేశ్‌లోని అటవీ సంపదలో 44.228 శాతం భాగం తెలంగాణ ప్రాంతానిది. తెలంగాణ సహజవనరులు గత యాభై సంవత్సరాలలో తెలంగాణ ప్రజలకు వినియోగ పడలేదన్నది నగ్నసత్యం. ఆంధ్రప్రదేశ్ బడ్జెట్ వివరాలను పరిశీలించినట్లయితే రాష్ట్రానికి లభించే మొత్తం ఆదాయంలో తెలంగాణ ప్రాంతం నుంచి లభించే ఆదాయం సగం కంటె ఎక్కువ.

**తెలంగాణకు పట్టని 'విశాలాంధ్ర'**

తెలుగు ప్రజలందరికి ఒక రాష్ట్ర కావాలన్న విశాలాంధ్ర ఉద్యమం ఫలితంగా ఆంధ్రప్రదేశ్ అవతరించిందని సిపిఐ (ఎం) అంటున్నది. ఇది చారిత్రక అసత్యం. బెజవాడలో కూర్చుని ఆంధ్ర కమ్యూనిస్టు నాయకులు పల్లించిన విశాలాంధ్ర నినాదంతో తెలంగాణ ప్రజలకు ఎన్నడూ సంబంధంలేదు. నిజాం రాచరిక, భూస్వామ్య వ్యవస్థకు వ్యతిరేకంగా జరిగిన తెలంగాణ సాయుధ పోరాటంలో గాని, స్టేట్ కాంగ్రెస్ ఉద్యమాలలో గాని విశాలాంధ్ర నినాదం ప్రాధాన్యం వహించలేదు. యాభై అయిదు సంవత్సరాల కిందటి చరిత్ర పేజీలను చదివితే తెలంగాణ ప్రజలు ముల్కి తదితర ఉద్యమాల ద్వారా విశాలాంధ్రవాదాన్ని గట్టిగా ప్రతిఘటించారని స్పష్టమవుతుంది. ఈ విషయాన్ని, తెలంగాణ ప్రజల భయసందేహాలను, విశాలాంధ్ర పట్ల తెలంగాణ ప్రజల వ్యతిరేకతను ఫజులలీ కమిషన్ తన నివేదికలో రికార్డు చేసింది. తెలుగుతల్లి సెంటిమెంట్ ఎన్నడూ తెలంగాణ ప్రజలను ఆకర్షించలేదు. పూర్వపు హైదరాబాద్ రాష్ట్రంలో తెలంగాణ ఆంధ్ర మహాసభ సైతం తెలుగు ప్రజలందరికి ఒక రాష్ట్రం ఏర్పడాలని కోరలేదు.



తెలంగాణ ఆంధ్ర మహాసభకు సారథ్యం వహించిన మాడపాటి హనుమంతరావు కూడా 1955లో తెలంగాణ రాష్ట్ర ఉద్యమాన్ని బలపరిచారు.

ఆంధ్రప్రదేశ్ విభజనను నివారించడానికి సిపిఐ(ఎం) సబ్ కమిటీకి పంపిన లేఖలో సూచించిన ఏడు చర్యలు కొత్తవేమీ కాదు. ఈ చర్యలు గత యాభై సంవత్సరాల కాలంలో వివిధ పథకాలు, సూత్రాల రూపంలో ముందుకువచ్చి విఫలమయినాయి. 610 జివో అమలు ఎంత ఘోరంగా విఫలమయిందో గిర్‌గిలానీ కమిటీ నివేదిక వెల్లడించింది. సిపిఐ(ఎం) ఇంకా ఆ జివో గురించి మాట్లాడడం విచిత్రం. తెలంగాణ, ప్రాంతంలో నిజాం పాలనలో నిర్మించిన పలు పరిశ్రమలకు, ప్రాజక్టులకు కాంగ్రెస్, తెలుగుదేశం ప్రభుత్వాలు తాళాలు వేసాయి. లేక వాటిని అమ్మకానికి పెట్టాయి. తెలంగాణ రాష్ట్ర నిర్మాణాన్ని అడ్డుకోవడానికి కమ్యూనిస్టులు, ఇతర సైంధవులు పలుబూచులను చిత్రిస్తున్నారు. తెలంగాణ రాష్ట్ర డిమాండ్‌ను అంగీకరిస్తే అటువంటివే ఇంకెన్నో డిమాండ్లు ముందుకు వస్తాయని కమ్యూనిస్టులు భయపెడుతున్నారు. ఫజులలీ కమిషన్ సిఫారసుచేసిన తెలంగాణ, విదర్భ రాష్ట్రాలను పక్కన పెట్టి గడచిన యాభై సంవత్సరాలలో కాంగ్రెస్, కాంగ్రెస్ ఏతర కేంద్ర ప్రభుత్వాలు దేశంలో పలు రాష్ట్రాలను ఏర్పాటుచేసిన విషయాన్ని కమ్యూనిస్టులు విస్మరిస్తున్నారు.

తెలంగాణ రాష్ట్ర నిర్మాణానికి వ్యతిరేకంగా ఆంధ్రప్రదేశ్ నాయకులు కొందరు గగ్గోలు చేస్తున్నప్పటికీ తెలంగాణ కాంగ్రెస్‌నాయకులు నోరు విప్పడం లేదు. తెలంగాణ ప్రజలకు ద్రోహం చేయడం కాంగ్రెస్ తెలంగాణ నేతలకు కొత్తకాదు. తెలంగాణ రాష్ట్ర సమితి కృషి ఫలితంగానే తెలంగాణ రాష్ట్ర సమస్య జాతీయస్థాయిలో, కేంద్రప్రభుత్వంలో ప్రాధాన్యం పొందగలుగుతున్నది. ఎవరు అడ్డుపడినా తెలంగాణ ప్రజాభిప్రాయం గెలువకతప్పదు.

('వార్త' సౌజన్యంతో)

# నీటి పంపిణీలో నీరుగారిన న్యాయం

- ఎం. కోదండరామ్, తడ్క యాదగిరి

సమస్త ప్రాణికోటికి నీళ్ళు అవసరం. కానీ మన పాలకులు ఈ సహజసూత్రాన్ని కూడా మరచి పోతున్నారు. కాంగ్రెస్ ప్రభుత్వం అధికారంలోకి రాగానే హడావుడిగా పాలకపార్టీ నాయకులు ప్రతిపక్షపార్టీ నాయకులను కలుపుకుని ఢిల్లీకి వెళ్ళి అల్మట్టి నుంచి నీళ్ళు ఇప్పించమని ప్రధానమంత్రికి విజ్ఞప్తి చేశారు. సమస్య ఎక్కడ వస్తుందంటే ఆంధ్రప్రదేశ్‌లో ఉన్న కృష్ణా పరివాహక ప్రాంత ప్రజలందరి కొరకు నీళ్ళు అడగలేదు. కృష్ణా డెల్టా కోసమే అడిగారు. పాలకులలో నెలకొని ఉన్న ఈ పక్షపాతాన్ని సరిచేయవలసిన పత్రికలు వంతపాడాయి.

ఉమ్మడి రాష్ట్రంలో ఆది నుంచి ఇదే వైఖరి కొనసాగుతోంది. ప్రభుత్వం అత్యధిక వనరులను సాగునీరు కోసం ఖర్చు చేసింది. కానీ నాల్గింట మూడువంతుల నీళ్ళు కోస్తాకుదక్కాయి. ప్రాంతాల వారీగా కాలువకింద సాగవుతున్న భూవిస్తీర్ణాన్ని పరిశీలిస్తే ఈ విషయం స్పష్టంగా అర్థమవుతుంది.

నీళ్ళు రాని తెలంగాణ, రాయలసీమ జిల్లాలలో పండించ గల మెట్ట పంటలపైన పరిశోధనచేసి దిగుబడిని పెంపొందించడానికి ప్రయత్నిస్తే ఈ ప్రాంతాలలో అదనపు కాలువ నీళ్ళ కోసం డిమాండ్ తలెత్తకపోయేది. కానీ ప్రభుత్వం ఆ దిశగా ప్రయత్నం చేయలేదు. కాబట్టి బోర్లు వేసి నీళ్ళు తెచ్చి వరి, పత్తి, మిర్చి వంటిపంటలను పండించక తప్పలేదు. నీళ్ళు వచ్చినన్ని రోజులు ఎవరూ అదనపు సాగునీళ్ళను డిమాండ్ చేయలేదు. భూగర్భ జలాలు అడుగంటి పోవడంతో నీటి సంక్షోభం తత్ఫలితంగా వ్యవసాయ



సంక్షోభం తలెత్తింది. ఈ పరిస్థితిని రూపుమాపడానికి మొదట జలసాధన ఉద్యమాలు తలెత్తాయి. వరంగల్, నల్గొండ, మహబూబ్‌నగర్ జిల్లాల్లో 1980, 1990 దశకాల్లో అవి ఉధృతంగా సాగాయి. రాయలసీమలో నేటి ముఖ్యమంత్రి రాయలసీమ విమోచన ఉద్యమంలో పాల్గొన్నారు.

ఈ పరిస్థితి వల్లనే తాగునీరే ప్రధాన సమస్యగా మారింది. చాలా గ్రామాల్లో తగినన్ని నీళ్ళు లేవు. ఫ్లోరిన్ సమస్య వలన జీవించే హక్కుకీ ప్రమాదం వాటిల్లిన గ్రామాలు, ముఖ్యంగా నల్గొండలో వందల సంఖ్యలో ఉన్నాయి. ఈ సమస్యను రూపుమాపేందుకే జలసాధన ఉద్యమం కృష్ణా జలాలను గ్రామాల్లోకి మళ్ళించాలని డిమాండ్ చేసింది. ఈ ఉద్యమాలకు కొనసాగింపే నేటి తెలంగాణ ఉద్యమం.

### కలుషితమైన భూగర్భ జలాలు

వరంగల్ జిల్లా జనగామ పట్టణంలో పాలను అమ్మినట్లే నీళ్ళను ప్యాకెట్లలో, డబ్బాలలో అమ్ముతున్నారు. రోజు ఉదయం పాలతో పాటు నీళ్ళను కొంటారు. ఈ పట్టణంలో నీటిని శుద్ధిచేసి అమ్మే కంపెనీలు ఉన్నాయి. ఇదే పరిస్థితి నల్గొండ జిల్లా పోచంపల్లిలో ఉంది. భూదాన్ పోచంపల్లిగా ప్రసిద్ధిగాంచిన ఈ ఊరిలో తయారైన వస్త్రాలకు ప్రపంచమంతటా గిరాకీ ఉంది. ఇందిరాగాంధీ సైతం పోచంపల్లి చీరలను ఎంతో ఇష్టంతో వాడేవారు. కానీ స్వయంకృషితో అంతపేరు సాధించిన ఈ గ్రామంలో భూగర్భ జలాలన్నీ అడుగంటి ఫ్లోరిన్‌తో కలుషితమయ్యాయి. ఇందువల్ల ప్రజలు కీళ్ళనొప్పుల వంటి ఆరోగ్య సమస్యలను ఎదుర్కొంటున్నారు. వైద్య సౌకర్యాలు అందుబాటులో లేవు. వేలకొద్ది రూపాయిలు వెచ్చించవలసి వస్తోంది. పోచంపల్లిలో అధికసంఖ్యలో చేనేత కార్మికులు తమ వృత్తి చేయడానికి మగ్గం గుంటలో కూర్చోవాలి. జరీ డిజైన్ల నేత కోసం బరువైన పాకోళ్ళు (నేత నేయడానికి దారం పోగుల అల్లికను అమర్చేది) తొక్కాల్సి ఉంటుంది. అయితే కీళ్ళ నొప్పుల మూలంగా నేతన్నలు త్వరగా అలసిపోతున్నారు. దీంతో ఫ్లోరిన్ నీటిని తాగడం ఆపి హైదరాబాద్ నుంచి సరఫరా అయ్యే మంజీరా నీరు కొనుగోలు చేసి తాగాలనే ప్రచారం బాగా సాగింది. గడచిన నాలుగేళ్ళ నుంచి పోచంపల్లి గ్రామంలోని 12వేల జనాభాలో సగం మంది తాగునీటిని కొనుగోలు చేస్తున్నారు. మొత్తం 2200 కుటుంబాలలో 1100 కుటుంబాలు, ఒక్కో కుటుంబం సగటున రోజుకు 20 లీటర్ల నీటిని వినియోగిస్తుంది. అంటే రోజుకు 10 రూపాయిల చొప్పున ఒక కుటుంబం నెలకు 300 రూపాయలు వెచ్చిస్తుంది. సంవత్సరానికి 3,600 రూపాయలు. చేనేత కార్మికకుటుంబం సగటు నెలసరి ఆదాయం రూ. 1800 నుంచి 2,200ల వరకు ఉంది. అంటే సంవత్సరంలో రెండు నెలల ఆదాయం మంచినీటికే ఖర్చు చేయాల్సిన పరిస్థితి. ఒక్క పోచంపల్లి గ్రామంలోనే

సంవత్సరానికి 40 లక్షల రూపాయిల నీటి వ్యాపారం సాగుతోందంటే నల్గొండ జిల్లా మొత్తంలో అదెన్ని కోట్ల రూపాయిల వ్యాపారమో ఊహించవచ్చు.

మంజీర నీరు అని కొన్ని, ఫ్లోరిన్ రహిత నీరు అని మరికొన్ని కంపెనీలు నీటివ్యాపారం చేస్తుంటే ప్రభుత్వం నిమ్మకునీరెత్తినట్టు చోద్యం చూస్తోందని ఇక్కడి ప్రజలు వాపోతున్నారు. నేడు ఫ్లోరిన్ పీడిత ప్రాంతాల ప్రజలు మంచినీరు సాధించుకోవడమే తమ ప్రధాన ధ్యేయమని అంటున్నారు. ఒక అంచనా ప్రకారం 60 కోట్ల రూపాయిల నీటి వ్యాపారం సాగుతుంది. మహబూబ్‌నగర్ బస్సులో చూస్తే చుట్టాలను చూసేందుకు వెళ్ళేవారు పళ్ళు, ఫలహారాలు కాదు, నీళ్ళు పట్టుకుని పోతుంటారు. హైదరాబాద్‌లో పాలమ్మి తిరిగి గ్రామాలకు వెళ్ళే పాల వ్యాపారులు క్యాన్‌లలో నీళ్ళు తీసుకుపోతుంటారు. తాగునీటికి ఇంతటి కటకట ఉండగా 150 సంవత్సరాలలో మొట్టమొదటిసారి నీటి కొరతను ఎదుర్కొంటున్న కృష్ణాడెల్టాపై పాలకులకు, పత్రికలకు ఇంత మమకారం ఎందుకు? కృష్ణాడెల్టాకు నీళ్ళు ఇవ్వవద్దని అనడం లేదు. తెలుగుజాతి అంతా ఒక్కటే అని, దాన్ని విచ్ఛిన్నం చేయవద్దనే వాళ్ళు, వచ్చే నీటిని తెలుగువాళ్ళు కలిసికట్టుగా వాడుకోవాలని చెప్పాలి కదా!

ప్రాంతాలవారీగా వివిధ వనరుల ద్వారా సాగైన భూమి విస్తీర్ణం

**2001-2002 (హెక్టార్లలో)**

| వివిధ వనరుల ద్వారా నీరందించిన భూమి నికర విస్తీర్ణం | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ప్రాంతం | కాలువలు | చెరువులు | గొట్టపు | ఇతర బావులు | ఇతర బావులు | మొత్తం వనరులు |
| కోస్తాంధ్ర | 1,202,904 | 296,284 | 346,417 | 116,200 | 115,119 | 2,076,924 |
| (76.99) | (52.11) | (31.05) | (14.32) | (63.78) | (49.01) | |
| రాయలసీమ | 111,418 | 78,421 | 283,652 | 149,976 | 13,346 | 636,813 |
| | (7.13) | (13.82) | (25.42) | (18.48) | (7.39) | (15.03) |
| తెలంగాణ | 248,091 | 192,814 | 485,642 | 545,551 | 52,033 | 1,524,131 |
| (15.88) | (33.97) | (43.53) | (67.21) | (28.83) | (35.96) | |
| మొత్తం | 1,562,413 | 567,519 | 1,115,711 | 811,727 | 180,498 | 4,237,868 |
| (100.00) | (100.00) | (100.00) | (100.00) | (100.00) | (100.00) | (100.00) |



### మంచినీటికే ప్రాధాన్యత

ఎన్డీఏ ప్రభుత్వం రూపొందించిన జలవిధానం ప్రకారం, ప్రపంచవ్యాప్తంగా ఆమోదించిన జలపంపిణీ సూత్రాల ప్రకారం నీరు పరిమితంగా ఉంటే ముందు తాగునీటి అవసరాలకు కేటాయించాలి. ఆ తర్వాత వ్యవసాయానికి ఇవ్వాలి. జూరాల నుంచి దిగువన డెల్టా వరకు గల ప్రాంతాలన్నింటి మధ్య వచ్చిన నీటిని సమంగా పంచాలి. కానీ విచిత్రం ఏమిటంటే అల్మట్టి నుంచి వదిలిన నీళ్ళు డెల్టాకు ఎప్పుడు చేరతాయా అని లెక్కలు వేస్తున్నారు. తాగునీటి అవసరాలు ఎంత, అదిపోను, ఏ ప్రాంతానికి ఎన్ని నీళ్ళు వస్తాయి అని పత్రికలు కూడా ఆలోచించడం లేదు. ఇంతటి వివక్ష బహిరంగంగా కనపడుతుంటే ఉమ్మడిరాష్ట్రంలో తెలంగాణ ఎట్లా ఉండగలుగుతుందో ఆలోచించండి.

('వార్త' సౌజన్యంతో)

# అనాది ఆధారాలు అభివృద్ధికి ద్వారాలు

- మల్లెపల్లి లక్ష్మయ్య

ఈరోజు వాతావరణమంతా గోదావరి నీటిని వినియోగించుకోకపోతే, రాష్ట్ర అభివృద్ధి ముఖ్యంగా కరువు కాటకాలతో, ఆకలి దప్పులతో అలమటిస్తున్న మధ్య గోదావరి పరివాహక ప్రాంతం అంటే తెలంగాణ ప్రాంతం ప్రజలకు విముక్తి లేదనేది అందరూ అంగీకరిస్తున్నారు. చివరకు ప్రభుత్వం రూపొందించిన గోదావరి నీటి ప్రాజెక్టు ప్రతిపాదనల్లో కూడా పేదరికం నిర్మూలనకు ఇది ఉపయోగపడుతుందని పేర్కొన్నారు. గోదావరి నదీ జలాల వినియోగం గురించి ఎంతో శ్రద్ధ ఉన్నట్లు ప్రభుత్వం తనకు తానుఎన్నో ప్రకటనలు ఇచ్చుకుంటున్నది. అయితే ఈ ప్రాంతంలో ఇప్పుడు ఏర్పడిన పరిస్థితికి గత యాభై ఏళ్లుగా ఈ రాష్ట్రాన్ని ఏలిన పాలకుల అశ్రద్ధ, అలసత్వం, వివక్ష అన్నీ కలిసి కారణమయ్యాయి. ముఖ్యంగా ఈ ప్రాంతంలో వందల ఏళ్ళుగా నీటి వనరులను ధ్వంసం చేయడం వల్ల భయానక స్థితి ఏర్పడింది. "సెరువుల నీళ్ళుపోయి సెరువెనక పడ్డంక ఏమి చేస్తే ఏమౌతుంది" అనేది సామెత. ఏదైనా ఒక అవకాశం చేజారి పోతే ఈ సామెత చెప్పడం తెలంగాణలో అలవాటు. కానీ నిజానికి ఈ సామెత ప్రత్యక్షంగానే అతికింది. ఈ రోజు తెలంగాణలో చెరువులన్నీ కట్టలు తెగి, మేటలతో పూడుకుపోయి, మరెన్నో తుమ్మ చెట్లు మొలిచి ఎక్కడ ఉన్నాయో కనిపించని స్థితి ఏర్పడిది. ఇంకా కొన్ని చోట్ల స్థానిక ప్రజల అవసరాల కోసం కాకుండా దగ్గర ఉన్న పట్టణాల, నగరాల ప్రజల దాహాన్ని తీర్చడం కోసం తరలిస్తున్నారు. దీని ఫలితంగా 1968 సంవత్సరంలో రాష్ట్రం మొత్తం మీద 10.70 లక్షల హెక్టార్ల సాగుతో 36శాతం నీటి పారుదల అవసరాలను తీర్చిన చెరువులు



1998 వచ్చే సరికి 7.20 లక్షల హెక్టార్లతో కేవలం 17శాతం నీటి పారుదల అవసరాల స్థాయికి పడిపోయింది. దీనిని బట్టి చెరువుల విధ్వంసం ఏ స్థాయిలో జరిగిందో అర్థమవుతుంది. అయితే ఈ చెరువుల వినాశనం కోస్తాంధ్రకన్నా తెలంగాణను ఎక్కువ దెబ్బతీసింది. 1950 ప్రాంతంలో తెలంగాణతో 11 లక్షల హెక్టార్ల భూమి చెరువుల ద్వారా సాగయితే ప్రస్తుతం అది 5,42,620 హెక్టార్లకు పడిపోయింది. కోస్తాంధ్ర ప్రాంతంలో కాలువల ద్వారా ఆలోటు పూర్తయితే, తెలంగాణలో ప్రాజెక్టుల నిర్మాణం జరగక దాని నష్టం ఈనాటి పరిస్థితికి కారణమైంది. ప్రాజెక్టుల నిర్మాణంలో జరిగిన వివక్ష ఒక కారణమైతే, చెరువుల విధ్వంసం ఈ ప్రాంత ప్రజల ఆర్థిక సామాజిక, సాంస్కృతిక పునాదులను పెకిలించి వేసింది. నిజానికి చెరువుల వినాశనం జన జీవనాన్ని అధఃపాతాళానికి తోసింది. ఇటు వంటి చెరువుల విధ్వంసం కథలు ఊరూరా వినిపిస్తాయి. అరవై ఏళ్ళ వయస్సు పైబడిన రైతులను ఎవరిని కదిలించినా ఈ కథలు కన్నీటితో బాటు ఉబికివస్తాయి.

వరంగల్ జిల్లా ధర్మసాగర్ మండలంలోని ఒక ఊరు దేవనూరు. దాదాపు 70 ఏళ్ళు పైబడిన రైతు రాఘవరెడ్డి. ఈ చెరువుల వినాశనాన్ని కళ్ళారా చూసిన ఈ రైతు నోటినుంచి ఆమాటలు వింటే మంచిది. ధర్మసాగరం సెరువుమత్తడిపారితే ఆ నీళ్ళు దేవనూరుకు వస్తాయి. దేవనూరు సెరువు కింద పారకం 200 ఎకరాలు. ధర్మసాగర్ సెరువు మత్తడిపారక ఎన్నో ఏళ్ళయింది. 1995లో ఒకసారి మత్తడి పారినట్టు గుర్తు. ధర్మసాగర్ సెరువు నీళ్ళు వరంగల్ పట్నానికి తాగడానికి తీసుకుపోతున్నారు. ఇది 1935లో నవాబుల కాలం నుంచి మొదలైంది. అప్పట్లో ఈ నీళ్ళను నవాబు తోటలకు పారిచ్చే వాళ్ళు. అయితే అప్పుడప్పుడు నీళ్ళను కింద పంటలకు వదిలేవాళ్ళు.

కానీ 1965 నుంచి మొత్తానికే మానేశారు. దానితో ధర్మసాగర్ సెరువు కింద పంటలు పోయ్యాయి. మత్తడి పారక మా సెరువు ఎండిపోయింది. ధర్మసాగరం. దేవనూరు సెర్లల్ల నీళ్ళు దానిచుట్టూ కొండల్ల చెట్లు, చేమలు, పచ్చగడ్డి బాగా ఉన్నన్నినాళ్ళూ ఊరు బాగున్నది. రెండు సెరువులు ఎండిపోయి పరిస్థితి దిగజారింది. దీంతో ఊర్లో వ్యవసాయం బాగా దెబ్బతిన్నది. ఇంతకుముందు నక్క ఊర్లవారు ఇక్కడికి పనికోసం వచ్చేవారు. ఇప్పుడయితే దేవనూరు వాళ్ళే పని వెతుక్కుంటూ వేరే ఊర్లకు పోతున్నారు. కులవృత్తులు చేసే వాళ్ళ పరిస్థితి ఇంకా అధ్వాన్నంగా తయారయింది. చేపలు పట్టే వాళ్ళకు, ముఖ్యంగా ముదిరాజ్ (తెనుగోళ్లు)ను ఇది బాగా దెబ్బతీసింది. చాకలివాళ్ళ పరిస్థితి కూడా అట్లే అయింది. బట్టలుతకడానికి చెర్లో నీళ్ళు లేకపాయె. బట్టలుతికించుకోను రైతుల దగ్గర పైసలు లేక పాయె. ఇట్లనే ఒక్కొక్కరు ఒక్కొక్కరకంగా దెబ్బతిన్నారు అని రాఘవరెడ్డి తన అనుభవ సారాన్నికాచి వడబోసి మనముందుంచారు.

మరో చెరువు కథ మరిన్ని సంగతులను మన ముందుంచుతున్నది. మంథని అడవి ప్రాంతంలో కాటారం, మహాముత్తారం మండలాల్లోని పది, పన్నెండు గ్రామాలకు

ఆధారమైన గూడెం చెరువు కొన ఉపిరితో కొట్టుమిట్టాడుతున్నది. నక్సలైట్ల ఆధిపత్యం చెలాయిస్తున్న ప్రాంతంలో ఉన్న ఈ చెరువు దాదాపు మూడువేలకుపైగా ఎకరాలకు గతంలో నీరందించేది. ఈరోజు అది కుచించుకుపోతున్నది. వందల ఏళ్ళ కిందట నిర్మాణమైన ఈచెరువుకు మరమ్మత్తులు లేక రైతుల పొలాలకు నీళ్ళు అందించలేని దీనస్థితిలో ఉన్నది. నిజానికి ఆ చెరువుకింద అంచనా వేసిన మొత్తం పంటలు పండితే ఏటా పదిహేను కోట్ల రూపాయల పంట పండే అవకాశముంది. ఇప్పుడు అవకాశం సన్నగిల్లుతున్నది. దీనిని మరమ్మత్తు చేయడానికి ప్రభుత్వాధికారులు ఐదు కోట్లతో అంచనాలు వేశారు. ఇంతవరకు దాని ఉలుకు, పలుకు లేదు. దీంతో రైతులు కూలీలుగా, కూలీలు పనిదొరకనివాళ్ళుగా, వాళ్ళు నక్సలైట్లుగా మారుతున్నారు. మాటమాట్లాడితే అభివృద్ధి మా జీవితం అంటున్న ప్రభుత్వాధినేతలకు ఈ స్థితి కనిపించకపోవడం విచారకరం. అంతేకాకుండా, అక్కడి రైతులు పంటలు అమ్ముకోవాలంటే ఎడ్లబండ్లమీద ధాన్యాన్ని తరలించాలి. రాష్ట్రం మొత్తంలో తార్‌రోడ్లు మెరుపులు మెరిపిస్తున్న ప్రభుత్వం అవసరమైన చోటుకు రోడ్లు వేయలేదు. కరువుతో గుప్పెడు గింజలు పండని ప్రాంతాలకు మాత్రం సిమెంటు రోడ్డు వేశారు. ఇది అభివృద్ధిలో ఉన్న అంతరం. దీని అంతరార్థం ఏమిటో ఎవరికీ బోధపడదు.

గతంలోని, ప్రస్తుతం ఉన్న ప్రభుత్వాలన్నీ చెరువుల నిర్వహణలో ఆలసత్వం ప్రదర్శించడం వల్ల కరువు సమస్య తీవ్రమవడమే కాకుండా, తాగునీటికి కూడా కటకట ఏర్పడింది. చెరువులు కేవలం వ్యవసాయ అభివృద్ధికే అనుకుంటే పొరపాటు. ప్రజల చరిత్రకు, సంస్కృతికి, సాంప్రదాయాలకు, జీవన విధానాలకు ప్రత్యక్ష సాక్ష్యాలు, ప్రతీకలు కూడా. మానవ నాగరికత పురోగతిలో చెరువుల నిర్మాణం, ఉనికి ఒక విప్లవం. ప్రజలకు చెరువులు స్థిరమైన జీవనాన్ని అందించాయి. చెరువు చుట్టూరా కులాలు ఏర్పడ్డాయి. రైతుల భూములకు నీళ్లు, కూలీలకు ఉపాధి. భూగర్భ జలాలు పెరుగుదలతో తాగునీటి కొరత లేకుండా చేసింది. అంతేకాకుండా, కుండలు చేసే కుమ్మరి వాళ్ళకు మట్టిని. ఇంటి కప్పుల మీద వేసుకోవడానికి తుంగగడ్డిని, తెనుగోళ్ళకు, బెస్తవాళ్ళకు చేపలను ప్రత్యక్షంగా అందించింది. ఈత, తాటిచెట్లు నుంచి పుష్కలంగా కల్లు రావడానికి భూగర్భ జలాలు ద్వారా పరోక్షంగా ఉపయోపడుతున్నది. అంతేకాకుండా రైతుల భూముల్లో భూసారం దెబ్బతినకుండా, ఎండాకాలంలో చెరువులోని ఒండ్రుమట్టిని చేన్లల్లో వేసేవాళ్ళు. ఆ విధంగా చెరువులో మేట పెరగకుండా వీలయ్యేది. ఆవులు, మేకలు, గొర్లు, బర్రెలు తాగడానికి నీళ్ళను చెరువు అందించేంది. వాటి మేతకు గడ్డి దొరికేది. అందువల్ల గ్రామాల్లో చెరువుల పరిరక్షణ ఒక కర్తవ్యంగా ఉండేది. ఈచెరువుల నిర్మాణంలో, నిర్వహణలో దళితులైన నీరడికాండ్లు తమ ప్రాణాలు పణంగా పెట్టి చెరువును కాపాడిన సంఘటనలున్నాయి. చెరువులకు ఉండే తూముల్లో ఏర్పడే అడ్డకుంలను తొలగించడానికి ఎటువంటి రక్షణలు లేకుండా లోతైన నీళ్ళల్లో మునిగి వాటిని తొలగించే వాళ్ళు. కొన్నిసార్లు ప్రాణాలు కోల్పోవడం కూడా జరిగేది. అంతేకాకుండా



చెరువు నీటి వాడకం కోసం గ్రామాల మధ్య జరిగే దాడుల్లో, ఘర్షణల్లో దళితులు (నీరడికాండ్లు) బలి అయిన కథలు ఇప్పటికి ప్రచారంలో ఉన్నాయి. కరీంనగర్ జిల్లా జగిత్యాల దగ్గర మానాల చెరువు కోసం వెలమ, కాపుల మధ్య జరిగిన ఘర్షణల్లో కడారి జినుకన్న అనే నీరడి ప్రాణాలు కోల్పోయాడు. ఈ కథను ఇప్పటికి జానపద కళాకారులు ప్రదర్శిస్తుంటారు. దళితులైన నీరడికాండ్ల సాంకేతిక పరిజ్ఞానంతో చెరువు ఊరందరి జీవితాలను నడిపించేది. అందువల్ల చెరువు చుట్టూరా జనజీవితం పెరిగింది. అయితే ఎప్పుడైతే కేంద్రీకృత అధికారాలు కలిగిన ప్రభుత్వాలచే, ముఖ్యంగా స్వాతంత్ర్యానంతరం ఈ చెరువులు నిర్లక్ష్యానికి గురయ్యాయి. క్రూరుడుగా దుర్మార్గుడుగా పేరున్న నిజాం కాలంలో కూడా చెరువులకు మంచి రోజులే ఉన్నాయి. స్వయంగా నిజాం పరిపాలకులు ఎన్నో చెరువులు నిర్మించారు. ఆ విధంగా వందల ఏళ్ళుగా కొనసాగుతున్న నిరంతర వ్యవసాయాభివృద్ధికి, ప్రజల పురోగతికి అడ్డంకులు కల్పించలేదు. కానీ హైదరాబాద్ ఆంధ్రరాష్ట్రంలో కలిసి ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తర్వాత ఈ విధ్వంసం ప్రారంభమైంది. దీనికి పార్టీ భేదాలు లేవు. అన్ని పార్టీలు దీనిని ఒకే రకంగా సాగించాయి. అందువల్ల ఈరోజు గోదావరి జలాలు ఒక రకంగా ప్రజల జీవితానికి తప్పని సరయ్యాయి. ఒక రకంగా రాజకీయ పార్టీల వాగ్దానాలయ్యాయి. గోదావరి నదీ మీద ఎన్ని ప్రాజెక్టులు నిర్మించినప్పటికీ, తెలంగాణ ప్రాంతంలో ఉన్న చెరువులను కాపాడడం పాడుబడిన వాటిని బాగు చేయకపోతే ఈ ప్రాంతం ప్రజల అభివృద్ధికి అర్థం లేదు.

నూటికి ఎనభై శాతం మంది ప్రజలు ఇప్పటికీ వ్యవసాయం మీద ఆధారపడి గ్రామాల్లోనే నివశిస్తున్నారు. వారంతా వ్యవసాయంతో పాటు ఎన్నో వృత్తులను నమ్ముకొని జీవిస్తున్నారు. కానీ చెరువులు కనుమరుగైన ప్రాంతాలన్నింటిలో వలసలు పెరిగిపోయాయి. మహబూబ్‌నగర్ జిల్లాలో సగానికి పైగా జనాభా వలస వెళ్ళి బతుకులీడుస్తున్నందంటే ఈ పరిస్థితులే కారణం. ఆ జిల్లాలో పనపర్తి ప్రాంతంలో సప్తసముద్రాలు అనే ఏడు పెద్ద చెరువులుండేవి. అవి వేలాది ఎకరాల భూమికి నీరందించేవి. కానీ ఈరోజు అవి ఉండిలేని చందంగా ఉన్నాయి. అట్లా తెలంగాణ చెరువులు పోవడం వల్ల తాగునీటికే కాదు. కల్లుకు కూడా కొరత ఏర్పడింది. వేలాది మంది కల్లుగీత కార్మికులు, గౌండ్లకు ఉపాధినిచ్చే చెట్లు ఎండిపోయినాయి. గత మూడు సంవత్సరాల క్రితం వరంగల్ జిల్లా జనగామ ప్రాంతంలో వేలాది చెట్లు ఎండి పోయిన సంఘటనలు వార్తల్లోకెక్కాయి. అందువల్ల ప్రభుత్వం, నిపుణులు, రాజకీయపార్టీల నాయకులు గోదావరి జలాల సాధనతోపాటు, ఊరూరున మళ్ళీ చెరువులు కళకళలాడేటట్టు విధానాలు రూపొందించడంలో, ప్రభుత్వాలను మెప్పించడంలో, ప్రజలను చైతన్యవంతం చేయడంలో కృషి చేయాల్సిన అవసరం రోజురోజుకు మరింత పెరుగుతున్నది.

('ఆంధ్రజ్యోతి' సౌజన్యంతో)

# గోదావరి జలాల వినియోగం - వివక్షకు గురవుతున్న తెలంగాణ

- నాగోబా

గత 5 ఏళ్ళుగా తెలంగాణ ప్రజలు సమైక్యాంధ్ర రాష్ట్రంలో తెలంగాణాకు నదీ జలాల పంపిణీలో న్యాయబద్ధమైన వాటా లభించలేదని అందువల్ల కృష్ణా గోదావరీ జలాల్లో తెలంగాణకు రావల్సిన న్యాయమైన వాటా ఎంతో తేల్చి ప్రాజెక్టుల నిర్మాణం చేసి 50 లక్షల ఎకరాల బీడు భూములకు సాగు నీరందించాలని నినదిస్తూ ప్రభుత్వాన్ని డిమాండు చేస్తున్నారు. తెలంగాణ సాగునీటి ప్రాజెక్టులను నిర్లక్ష్యం చేసి తెలంగాణలో వ్యవసాయ రంగ సంక్షోభానికి, గ్రామీణ ఆర్థిక వ్యవస్థ కుప్ప కూలడానికి, కుల వృత్తుల వినాశనానికి కారణమైన తెలుగుదేశం ప్రభుత్వాన్ని గద్దె దింపి తమ ఆకాంక్షలు నెరవేరుతాయన్న గంపెడు ఆశతో కాంగ్రెస్ ప్రభుత్వాన్ని గద్దెనెక్కించారు. కాంగ్రెస్ ప్రభుత్వం అధికారంలో ఒక్క సంవత్సరం పూర్తి చేసుకున్నది. తెలంగాణ ప్రజల ప్రత్యేక రాష్ట్ర ఆకాంక్ష పట్ల కాంగ్రెస్ ప్రభుత్వం మోసపూరిత వైఖరిని అవలంభిస్తుండడమే కాదు సాగునీటి ప్రాజెక్టుల విషయాలలోనూ పూర్వపు అన్యాయము, వివక్ష కొనసాగిస్తున్నది. ఈ విషయాలను కూలంకషంగా చర్చించవలసి ఉన్నది. ఉత్తర తెలంగాణ జిల్లాలకు ప్రధాన నీటి వనరులు గోదావరి, మంజీరా, ప్రాణహిత, పెన్‌గంగ నదులే కనుక ప్రధానంగా ఈ నదీజలాల పంపిణీలో తెలంగాణకు ఎదురవుతున్న వివక్షని విశ్లేషించుకోవాలి.



## గోదావరిలో తెలంగాణ వాటా ఎంత?

ఈ కీలకమైన ప్రశ్నని తెలంగాణ ఉద్యమం, తెలంగాణ ప్రజలు చాలా కాలంగా వేస్తున్నారు. ప్రభుత్వం ప్రాంతాల వారీగా నదీజలాల వాటా ఎంతో తేల్చేందుకు సిద్ధంగా లేదు. అయితే అంతర్జాతీయంగా అమలులో ఉన్న సహజ న్యాయసూత్రాలను ఆధారం చేసుకొని గోదావరి జలాల్లో తెలంగాణ వాటా ఎంతో నిర్ధారించే ప్రయత్నం తెలంగాణ ఉద్యమం చేసింది. అంతర్జాతీయ లేదా అంతర్రాష్ట్ర నదీ జలాల పంపిణీ విషయంలో వివాదాలు గాని, డిమాండ్లుగాని తలెత్తినపుడు వాటిని పరిష్కరించేందుకు ఏర్పాటయ్యే ట్రిబ్యునళ్ళు సాధారణంగా అనుసరించే ప్రమాణాలు ఏమిటంటే 1. నదీ పరీవాహక ప్రాంతం 2. సాగుకు యోగ్యమైన భూముల లభ్యత. 3. అప్పటికే నిర్మాణమై ఉన్న ప్రాజెక్టుల నీటి వినియోగం 4. అభివృద్ధి లేని, కరువు పీడిత ప్రాంతాలు మొదలైనవి. గోదావరి పరీవాహక ప్రాంతంలో ఆనాడున్న మహారాష్ట్ర, కర్నాటక, ఆంధ్రప్రదేశ్, మధ్యప్రదేశ్, ఒరిస్సా, రాష్ట్రాల మధ్య గోదావరి జలాల పంపిణీ కోసం 1975 ఒక ట్రిబ్యునల్ ఏర్పాటయ్యింది. 1975 నుండి 1980 వరకు పైన పేర్కొన్న రాష్ట్రాల మధ్య పరస్పర ఒప్పందాలు జరిగినాయి. ఈ ఒప్పందాలన్నింటిని ట్రిబ్యునల్ చట్టబద్ధం చేసింది. ఈ ఒప్పందాల ఆధారంగా అంచనా వేసినపుడు ఆంధ్రప్రదేశ్ వాటా 1480 టి.ఎం.సి.లని తేలింది. ఇటీవలి 'వాప్కోస్' సంస్థ అధ్యయనంలో అది 1430 టిఎంసిలకు పడిపోయింది.

ఆంధ్రప్రదేశ్‌కు 75% విశ్వసనీయత మీద లభించిన 1480 టిఎంసి నీటిలో తెలంగాణ వాటా ఎంత? తెలంగాణకు వాస్తవంగా దక్కిన వాటా ఎంత? ఇవి ప్రజలు గమనించవల్సిన కీలక అంశాలు. ఆంధ్రప్రదేశ్‌లో ఉన్న గోదావరి పరీవాహక ప్రాంతంలో 70% తెలంగాణలో ఉన్నది. సుమారుగా 50లక్షల ఎకరాలు సాగుకు యోగ్యమైన భూమి తెలంగాణలో ఉన్నది. అభివృద్ధిలో వెనుక బడిన ప్రాంతం, వరుస కరువు కాటకాలకు గురవుతున్న ప్రాంతం. పైన పేర్కొన్న ప్రమాణాలను దృష్టిలో ఉంచుకొని చూసినపుడు గోదావరి నీటిలో 70%వాటా అంటే 1480 టిఎంసిలలో 1036 టిఎంసిలు తెలంగాణకు న్యాయంగా దక్కాలి. 30% పరివాహక ప్రాంతం 30% సాగుభూములున్న ఆంధ్రప్రాంతానికి గోదావరి జలాలలో 30% అంటే 444 టిఎంసిలు మాత్రమే దక్కాలి. కాని జరిగింది వేరు. గోదావరి జలాల్లో ఇప్పటికే వినియోగంలోకి వచ్చిన 760 టిఎంసిలలో 320 టిఎంసిలు ఆంధ్రప్రాంతానికి దక్కాయి. తమ వాటాగా వారికి దక్కాల్సినవి ఇంకా 124 టింఎంసిలు మాత్రమే. అయితే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఆంధ్రప్రాంతపు భవిష్యత్ ప్రాజెక్టులకు 405 టిఎంసిలను కేటాయించింది. అందులో ఒక్క పోలవరం కేటాయింపులే 325 టిఎంసిలు. అంటే ఆంధ్రప్రాంతానికి న్యాయబద్ధంగా దక్కవల్సిన వాటాకన్న 281 టిఎంసిలు ఆంధ్ర

ప్రాంతానికి తరలించే పథకాలు సిద్ధమై ఆగమేఘాల మీద అమలుకు నోచుకుంటున్నాయి. మొత్తం మీద 1480 టిఎంసిలలో న్యాయంగా తెలంగాణకు 1036 టిఎంసిలు కేటాయించాల్సి ఉండగా 755 టిఎంసిలే కేటాయింపులు జరిగాయి. అదే ఆంధ్ర ప్రాంతానికి 444 టిఎంసిలకు బదులుగా దక్కినవి 725 టిఎంసి. ఇదీ స్థూలంగా గోదావరి జలాల కేటాయింపుల్లో తెలంగాణకు జరిగిన అన్యాయం.

ఇక ప్రాజెక్టుల పరంగా జరిగిన వివక్షని అన్యాయాన్ని పరిశీలించవలసి ఉన్నది.

**శ్రీరామ్‌సాగర్ ప్రాజెక్టు :** సాగునీటి సౌకర్యంతో పాటు విద్యుత్ ఉత్పత్తి కోసం బహుళార్థక సాధక ప్రాజెక్టుగా, నిజామబాదు జిల్లా పోచంపాడు గ్రామం వద్ద నిర్మించడానికి నిజాం ప్రభుత్వం సంకల్పించింది. ఈ ప్రాజెక్టు ఉత్తరకాలువ ద్వారా ఆదిలాబాద్ జిల్లాలో, దక్షిణ కాలువ ద్వారా కరీంనగర్, వరంగల్, ఖమ్మం, నల్గొండ జిల్లాలో మొత్తం 40 లక్షల ఎకరాలకు 400 టిఎంసిల నీటిని వినియోగించి సాగునీరు అందించాలని నిర్దేశించారు. అయితే రాష్ట్రాల పునర్విభజన ద్వారా 1956లో ఆంధ్రప్రదేశ్ ఏర్పాటు తెలంగాణ జలవనరుల తరలింపులకి దోపిడీకి ప్రాతిపదిక అయ్యింది. అప్పటికే అనుమతులు లభించిన, నిర్మాణంలో ఉన్న ప్రాజెక్టులను విభజన అనంతరం కూడా కొనసాగించాలని, వాటిని ఎట్టి పరిస్థితుల్లోనూ నిలిపివేయరాదని రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ చట్టం స్పష్టీకరించినప్పటికీ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం హైదరాబాద్ రాష్ట్ర ప్రభుత్వం రూపొందించిన పథకాల అమలులో తీవ్ర నిర్లక్ష్యాన్ని ప్రదర్శించింది. దానికి తోడు తెలంగాణ ప్రాజెక్టులకు కేటాయించిన నీటిని ఆంధ్ర ప్రాజెక్టులకు తరలించేందుకు చర్యలు తీసుకున్నది. పోచంపాడు వద్ద గోదావరిలోయ ప్రాజెక్టు నిలిపివేయబడింది. తెలంగాణ ప్రజలు, నాయకులు కేంద్ర ప్రభుత్వానికి ఎన్నో మార్లు విజ్ఞాపన పత్రాలు సమర్పించగా 1963లో పోచంపాడు వద్ద ప్రాజెక్టుకు అనుమతి మంజూరు చేసింది. 40లక్షల ఎకరాలకు సాగునీందించే ప్రాజెక్టు 10లక్షల ఎకరాలకు కుదించబడింది. ప్రాజెక్టునైతే మంజూరు చేశారు కాని నిధుల కేటాయింపుల్లో దారుణ నిర్లక్ష్యానికి గురి అయ్యింది. 1969లో ప్రత్యేక రాష్ట్ర ఉద్యమం తర్వాతనే శ్రీరామ్‌సాగర్ ప్రాజెక్టు పనులు ఊపందుకున్నాయి. అయినా 40 ఏళ్ళ తర్వాత కూడా రెండోదశ పనులు పూర్తికాలేదు.

ప్రాజెక్టు ప్రస్తుత పరిస్థితి ఏమిటంటే, 196 టిఎంసిల వినియోగంతో స్టేజ్1, స్టేజ్ 2, వరదకాలువలకు సాగునీరందించాలి. కాని ఇటీవలి అధ్యయనం వలన తేలిందేమంటే శ్రీరామ్‌సాగర్ వద్ద నీటి లభ్యత 153 టిఎంసిలకు పడిపోయింది. అంటే 43 టిఎంసిల నీటికొరత (షార్ట్‌ఫాల్) ఇప్పటికే ఉన్నది. దీనికి ప్రధాన కారణం ఎగువన కర్నాటక మహారాష్ట్రలు ట్రిబ్యునల్ అవార్డును ఉల్లంఘించి ప్రాజెక్టుల నిర్మాణాలు చేపట్టడమే.



6-10-1975న ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్రల మధ్య కుదిరిన ఒప్పందం (ఈ ఒప్పందం ట్రిబ్యునల్ అవార్డులో భాగమే) ప్రకారం మహారాష్ట్ర గోదావరిపై పైథాన్ డ్యాముకి దిగువన, పూర్ణానదిపై సిద్దేశ్వర్ డ్యాముకి దిగువన, మంజీరానదిపై నిజాంసాగర్ డ్యాముకి దిగువన కొత్త ప్రాజెక్టులకు 60 టిఎంసిలకు మించి వినియోగించడానికి వీలులేదు. అనాటికి మహారాష్ట్ర సమర్పించిన ప్రాజెక్టుల వినియోగం 19 టిఎంసిలు అంటే మొత్తం 60+19=79టిఎంసిలకు మించి మహారాష్ట్ర హక్కులేదు. అయితే మహారాష్ట్ర ప్రభుత్వం రూపొందించిన మాస్టర్ ప్లాన్ ప్రకారం నిర్మాణం పూర్తయిన, నిర్మాణంలో ఉన్న, భవిష్యత్ ప్రాజెక్టుల కోసం నీటి కేటాయింపులు 101 టింఎంసిలు. అంటే 22 టిఎంసిల నీటిని మహారాష్ట్ర ఇప్పటికే అదనంగా వినియోగించుకుంటున్నది. కర్నాటకలోగూడా దాదాపు ఇదే పరిస్థితి.

**బాబ్లీ ప్రాజెక్టు :** ఈ సంగతులు ఇట్లుండగానే శ్రీరామ్‌సాగర్‌ని మరింత సంక్షోభంలోనికి తోసివేసే ప్రాజెక్టులను గోదావరిపై మహారాష్ట్ర నిర్మించపూనుకున్నది. నాందేడ్ జిల్లా ధర్మాబాద్ తాలూకాలో బాసరకు 20 కి.మీ దూరంలో బాబ్లీ వద్ద ప్రాజెక్టు శరవేగంతో నిర్మాణం సాగుతున్నది. ఈ ప్రాజెక్టు నిల్వ సామర్థ్యం 2.75 టిఎంసిలు. ఈ ప్రాజెక్టు స్థలం వద్ద గోదావరి నది బెడ్ లెవల్ 1070 అడుగులు. ప్రాజెక్టు ఫుల్ రిజర్వాయర్ లెవల్ (ఎఫ్ఆర్ఎల్) 1110 అడుగులు. శ్రీరామ్‌సాగర్ ఎఫ్ఆర్ఎల్ 1091 అడుగులు. ఒప్పందం ప్రకారం 1091 అడుగుల వద్ద శ్రీరామసాగర్ నీటి నిలువ ఎంత మేరకు ముంపుకు గురి అవుతుందో ఆ మేరకు మహారాష్ట్ర ప్రభుత్వం తమ ప్రాంతంలో నదిలో గాని, మరెక్కడైనా ఏ నిర్మాణాలు చేపట్టరాదు. అది శ్రీరామ్‌సాగర్ నిల్వ సామర్థ్యాన్ని దెబ్బతీస్తుంది. బాబ్లీ ప్రాజెక్టు 1070 అడుగుల వద్దనే నిర్మిస్తున్నందువల్ల శ్రీరామ్‌సాగర్ ఎఫ్ఆర్ఎల్ విస్తీర్ణాన్ని అడ్డుకొంటుంది. దీనివల్ల శ్రీరామ్‌సాగర్ నిల్వ సామర్థ్యాన్ని 1.5 టిఎంసిల నుంచి 2 టిఎంసిల మేరకు తగ్గించే అవకాశం ఉందని నిపుణులు అంచనా వేస్తున్నారు.

ఇవేగాక పైథాన్ డ్యాము నుండి నాంథేడ్ వద్ద గల విష్ణుపురి బ్యారేజి దాకా మరో 10 బ్యారేజీలను మహారాష్ట్ర నిర్మించతలపెట్టింది. ఈ బ్యారేజీల మొత్తం నిల్వసామర్థ్యం 10 టిఎంసిల వరకు ఉండొచ్చు. అయితే వాస్తవ వినియోగం 20 నుంచి 25 టిఎంసిల ఉండవచ్చునని నిపుణులు అంచనా వేస్తున్నారు. ఈ ప్రాజెక్టులన్నీ గనుక పూర్తయినట్లయితే శ్రీరామ్‌సాగర్ వద్ద మరింత నీటికొరత ఏర్పడే ప్రమాదం ఉన్నది. శ్రీరామ్‌సాగర్ వద్ద 100 టిఎంసిల నీటి లభ్యత గూడా దుర్లభం కానున్నది. ఈ నీటితో శ్రీరామ్‌సాగర్ మొదటి దశ ఆయకట్టు అవసరాలను కూడా తీర్చలేము. ఇక రెండోదశ మరియు వరద కాలువ సంగతి మరిచిపోవాల్సిందే. శ్రీరామ్‌సాగర్ రిజర్వాయర్ నుండి నీటిని ఎత్తిపోసి నిజాంసాగర్ ఆయకట్టు చివరి భూములకు నీరందించే గుత్ప,అలీసాగర్ ప్రాజెక్టులు వృథాగా మిగిలిపోతాయి.

**నిజాంసాగర్ - సింగూరు ప్రాజెక్టులు** : పైన పేర్కొన్న ఒప్పందం ప్రకారం 58 టిఎంసిల నీటి వినియోగంతో నిజామాబాద్ జిల్లాలో 275000 ఎకరాలకు సాగునీరందించేందుకు అంగీకారం కుదిరింది. నిజానికి నిజాంసాగర్ ప్రాజెక్టును నిజాం ప్రభుత్వమే రూపకల్పన చేసింది. నిజాం ప్రభుత్వంలో గొప్ప ఇంజనీరు అలీనవాజ్‌జంగ్ నిజామాబాద్ జిల్లా ప్రజలకు ఇచ్చిన అపూర్వ కానుక నిజాంసాగర్ ప్రాజెక్టు. ఇది ఆ కాలంలో భారతదేశంలోనే అతిపెద్ద ఆనకట్ట. 1924 లో ప్రారంభమయ్యి 1931లో పూర్తయ్యింది. ఈ ప్రాజెక్టు నిర్మాణం వల్ల 20000 ఎకరాల విస్తీర్ణంలో చెరకు పంటకు సాగునీటి సౌకర్యం లభించింది. దాని ఫలితమే బోధన్‌లో 2500 టన్నుల క్రషింగ్ సామర్థ్యం కలిగిన భారీ చెక్కర ఫ్యాక్టరీ నిర్మాణం. నిజాంసాగర్ ప్రాజెక్టు కారణంగా హైదరాబాద్ రాష్ట్రంలో నిజామాబాద్ జిల్లా అభివృద్ధి చెందిన జిల్లాగా పేరుతెచ్చుకుంది.

ఇది గత కాలపు చరిత్ర. ప్రస్తుత పరిస్థితి ఏమిటంటే నిజాంసాగర్ ఆశించిన స్థాయిలో నీటిని సరఫరా చేయలేకపోతున్నది. ఇసుక మేటలు వేసి ప్రాజెక్టు నిల్వ సామర్థ్యం దారుణంగా పడిపోయింది. 2 లక్షల 75 వేల ఎకరాలకు సాగునీరు అందించాల్సిన ప్రాజెక్టు ఒకటిన్నర లక్షల ఎకరాలకుకూడా నీరందించడం లేదు. ఆయకట్టు చివరి భూముల స్థిరీకరణ కోసమే నిజామాబాద్ జిల్లా ప్రజలు ఎంతో ఒత్తిడి చేస్తే ప్రభుత్వం గుత్ప, అలీసాగర్ ఎత్తిపోతల పథకాలు రూపకల్పన చేసింది. ప్రాజెక్టును నిర్వహించడంలో కాలువల మరమ్మతుల్లో ప్రభుత్వాల దారుణ నిర్లక్ష్యం ఒక కారణమైతే సింగూరు నుంచి ఇటు నిజాంసాగర్‌కు అటు మెదక్ జిల్లాకు గాని ఒక్క చుక్క నీటిని వదలకపోవటం చేత మెదక్ జిల్లా కరువు జిల్లాగా, ఆకలిచావుల జిల్లాగా మారిపోయింది. నిజామాబాద్ జిల్లా మాచారెడ్డి మండలంలో కూడా ఆకలిచావులు నమోదు అయినాయి. నిజాంసాగర్ ఆయకట్టు ఎండిపోతున్నది. సింగూరులో నిల్వ ఉంచి ఆవిరి నష్టానికి పాల్పడుతున్నది గాని కరువు పీడిత ప్రాంతాలకు నీటిని విడుదల చేయడం లేదు.

పైన పేర్కొన్న ఒప్పందం ప్రకారం ఆంధ్రప్రదేశ్ సింగూరు వద్ద 30 టిఎంసిల నిల్వ సామర్థ్యంతో డ్యామును నిర్మించడానికి అంగీకారం కుదిరింది. అయితే హైదరాబాద్ నగరానికి ఒప్పందం ప్రకారం తరలించవల్సిన నీరు 4 టిఎంసిలే. అయితే సింగూరు జలాలను మొత్తం హైదరాబాద్ నగరానికి తరలించి మెదక్ జిల్లాను, నిజాం సాగర్ ఆయకట్టును ఎండగట్టడం ఎవరి ప్రయోజనాల కోసం? ఆంధ్రా రియల్ ఎస్టేటు వ్యాపారుల ధన దాహానికి హైదరాబాద్ నగరానికి 50 కి.మీ వ్యాపారంలో లెక్కలేనన్ని ఆంధ్ర వలస కాలనీల నిర్మాణం అయినాయి. మెదక్ జిల్లా ప్రజలకు, నిజాంసాగర్ రైతాంగానికి దక్కవల్సిన సింగూరు జలాలు ఆంధ్రా వలస కాలనీల అవసరాలను



తీర్చడానికి తరలివెళుతున్నాయి. ఇపుడు అనూహ్యంగా విస్తరించిన హైదరాబాద్ నగరానికి ప్రధాన నీటివనరు సింగూరు ప్రాజెక్టే. మంజీరానది మినహా మరే నీటి వనరు లేని మెదక్ జిల్లాకు ప్రత్యామ్నాయ నీటి వనరుని ఏర్పాటిచేసే ప్రయత్నం ప్రభుత్వం చేయనేలేదు. దేవాదుల ఎత్తిపోతల ద్వారా మెదక్ జిల్లాకు గోదావరి జలాలను తరలించే యోచన ఉన్నప్పటికీ స్టేజీలన్ని దాటుకుని మెదక్ జిల్లాను చేరేదెన్నడు? ఈ అన్యాయాన్ని వివక్షకు ఇంకెన్నాళ్ళు ఇక్కడి ప్రజలు భరించాలి?

**జలయజ్ఞంలో వివక్ష :**

కాంగ్రెస్ ప్రభుత్వం కొనసాగిస్తున్నాయని చెప్పుకుంటున్న జలయజ్ఞంలోనూ తెలంగాణ ప్రాజెక్టులపై నిర్లక్ష్యం, అన్యాయం చోటుచేసుకుంటున్నాయి. రెండేళ్ళలో పూర్తయ్యే 8 ప్రాజెక్టుల్లోనూ, 5 ఏళ్ళల్లో పూర్తయ్యే 18 ప్రాజెక్టుల్లోనూ నిజానికి పనులు జరుగుతున్నవి ఆంధ్రా రాయలసీమ ప్రాజెక్టుల్లోనే. ముఖ్యంగా గోదావరి బేసిన్‌లో ఉన్న పోలవరం, తాడిపూడి, పుష్కరం మొదలైన కోస్తా ఆంధ్ర ప్రాజెక్టుల్లో పనులు శరవేగంతో సాగుతున్నాయి. ఎల్లంపల్లి ప్రాజెక్టు పనుల్లో మాత్రం ఒక్క తట్ట మట్టి ఇంత ఎత్తిపోయలేదు? ఎందుకు?

పోలవరం డ్యాము లేకుండానే కుడి ఎడమ కాలువల తవ్వకాలు సాగుతున్నాయి. పోలవరం ప్రాజెక్టుకున్న అంతర్ రాష్ట్ర సమస్యలు ఏవీ పరిష్కారం కాలేదు. కేంద్ర ప్రభుత్వ అనుమతులూ లేవు. అయినా ప్రాజెక్టు పనులు సాగుతున్నాయి. ఇక తాడిపూడి పుష్కరం ఎత్తిపోతల పథకాలు పోలవరం నిర్మాణం ఆలస్యమవుతుందన్న కారణంగా రైతులకు సత్వర ప్రయోజనం కోసం ప్రత్యామ్నాయంగా ప్రతిపాదించబడినవి. వీటి కింది ఆయకట్ట పోలవరం ఆయకట్టులోనివే. పోలవరం నిర్మాణం అయితే తాడిపూడి, పుష్కరం ఎత్తిపోతల పథకాలు వృధా అవుతాయి. పోలవరం నిర్మాణం ఆలస్యమవుతుందన్న కారణంచేత ప్రతిపాదించబడిన పథకాలు పోలవరంతో పాటే నిర్మాణం అవడం ఎంత విచిత్రం ! ఇది ఆంధ్రా ప్రాజెక్టులపై ప్రభుత్వానికి ఉన్న ఆసక్తి, అనురక్తి నిదర్శనం. ఇటీవలే కేంద్ర జల సంఘం తాడిపూడి, పుష్కరం ప్రాజెక్టులు వృధా ప్రాజెక్టులని వ్యాఖ్యానించినట్లుగా పత్రికలు వెల్లడించినాయి. ఈ వృధా ప్రాజెక్టుల వల్ల వృధా అయ్యేవి 900 కోట్లు. 2005-06 బడ్జెట్‌లో తాడిపూడికి 200 కోట్లు పుష్కరానికి 100 కోట్లు కేటాయించారు. అదే సమయంలో పోలవరం ప్రాజెక్టుకు 269 కోట్లు కేటాయించినారు. కరువు పీడిత ప్రాంతాలకు సాగునీరందించే గుత్ప, అలీసాగరుకు చెరి 35 కోట్లు, ఎల్లంపల్లికి 100 కోట్లు మాత్రమే కేటాయించడం వివక్షకు తార్కాణాలు. వృధా ప్రాజెక్టులకు 300 కోట్లు కేటాయింపులైతే వెనుకబడిన తెలంగాణ ప్రాజెక్టులకు మాత్రం 170 కోట్లు.

**ఇచ్చంపల్లి నజాడ నపత్తా :**

పోలవరం ఇచ్చంపల్లి ప్రాజెక్టులను రెండింటిని గోదావరినదిపై దాదాపు ఒకే కాలంలో ప్రతిపాదించారు. రెండింటికి ముంపు, పునరావాసం మొదలైన అంతర్రాష్ట్ర

సమస్యలు ఉన్నాయి. గత 40 ఏళ్ళుగా ఈ సమస్యలేవీ ఇప్పటి దాకా పరిష్కారం కాలేదు. రెండింటికి కేంద్రం అనుమతులు లేవు. పోలవరం డ్యాము ప్రసక్తి లేకుండా అనుమతుల ప్రసక్తి లేకుండానే పరిపాలనాపరమైన అనుమతులు పొంది, ఇ.పి.సి పద్ధతిన టెండర్లు అయి, కాంట్రాక్టర్లచే అగ్రిమెంట్లు కుదుర్చుకొని పనులు ప్రారంభించినారు. పోలవరంతో పాటు రూపకల్పన జర్గిన ఇచ్చంపల్లి మాత్రం దుమ్ముగొట్టుకపోయి డ్యాము ఎత్తు 112 మీ. ఉండాల్నా లేదా 95 మీ ఉండాల్నా అన్న చర్చలు చేస్తూ ప్రాజెక్టును అజ్ఞాతంలో ఉంచేసినారు. కుక్కకు బొక్కని ఎరవేసినట్లుగా ఇచ్చంపల్లి ఇచ్చంపల్లి అంటూ నానాయాగీ చేసే రాజకీయవాదులకు దేవాదులను ఎరవేసి ఇచ్చంపల్లిని బుట్టదాఖలు చేయడం యాదృచ్ఛికం కాదు. కుట్ర. తెలంగాణలో ప్రాణహిత, ఇంద్రావతి నదుల సంగమం తర్వాత ఏ అడ్డుకట్ట ఉండకూడదన్నది ఆంధ్రా వ్యూహకర్తల ఆలోచన. అందుచేతనే ఇచ్చంపల్లిని సమస్యల సాకుతో ముందుకు రానివ్వరు. మరి అవే సమస్యలున్న పోలవరం పురోగతిలో ఎందుకు ఉంటున్నది? తెలంగాణ నిపుణులు విశ్లేషిస్తున్నదేమిటంటే తెలంగాణ రాష్ట్రం ఏర్పడే లోగా గోదావరిపై ఆంధ్ర ప్రాజెక్టులు పూర్తవ్వాలి. అపుడు రాష్ట్ర విభజన జరిగినా గోదావరి జలాలపై తమ హక్కును క్లెయిమ్ చేసుకునే వీలుంది. రాష్ట్ర విభజన రోజురోజుకీ అనివార్యమవుతున్న కీలకదశలో పోలవరం పనులు శరవేగంతో జరుగుతుండడంలో ఇమిడి ఉన్న రహస్యం లేదా కుట్ర ఇదే. ఈ కుట్ర అర్థం చేసుకొని ప్రతిఘటించ వలసి ఉన్నది.

**గోదావరి – కృష్ణా అనుసంధానం ఒక కుట్ర :**

నీటిపారుదల శాఖా మంత్రి శ్రీ పొన్నాల లక్ష్మయ్య గారు తన బడ్జెటు ప్రసంగంలో పేర్కొన్న మరో అంశం గోదావరి జలాలను కృష్ణా బేసిన్‌కు తరలించడం. ప్రసంగంలో మంత్రిగారు ఇలా అన్నారు. "గత కొన్ని సంవత్సరాలుగా కృష్ణా బేసిన్‌లో ప్రవాహాలు చాలా తక్కువగా ఉండడం వలన పంటలను వేయటానికి రైతులకు ధైర్యం ఉండడం లేదు. అందువలన బేసిన్‌లో ప్రాజెక్టులను నిర్మించడం ద్వారా సాధ్యమైనంత మేరకు గోదావరి నీటిని ఉపయోగించడానికి 150 నుండి 200 టిఎంసిల నీటిని కృష్ణా బేసిన్‌కు మళ్ళించడానికి రాష్ట్ర ప్రభుత్వం కట్టుబడి ఉన్నది."

ఉత్తర తెలంగాణ జిల్లాలకు ప్రధాన నీటి వనరు గోదావరి నది. సాగుకు యోగ్యమైన 50లక్షల ఎకరాల్లో కనీసం సగం భూమికైనా గోదావరి నీరు అందలేదు. 70% పరివాహక ప్రాంతం కల్గిన తెలంగాణకు గోదావరి జలాల కేటాయింపుల్లో ఇప్పటికే అన్యాయం జరిగిందని ప్రజలు వగచిపోతుంటే బేసిన్ అవసరాలు తీరకుండానే గణనీయమైన పరిమాణంలో నీటిని కృష్ణా బేసిన్‌కి తరలించడం ఎంత మాత్రం న్యాయం కాదని నిపుణులు అంటున్నారు. ఒక బేసిన్ నుంచి మరో బేసిన్‌కు నీటిని ఎప్పుడు తరలించాలి? అంతర్జాతీయ న్యాయసూత్రాల ప్రకారం బేసిన్‌లో కనిష్టంగా



60% అవసరాలు తీరినాక ఇంకా మిగులు ఏమైనా ఉంటే అపుడు మాత్రమే ఇతర బేసిన్‌కు తరలించే యోచన చేయవచ్చు. గోదావరి బేసిన్‌లో 30% అవసరాలు కూడా తీరకుండానే కృష్ణా బేసిన్‌కు తరలించే యోచన అంతర్జాతీయ న్యాయసూత్రాలకు విరుద్ధమని నిపుణులు వాదిస్తున్నారు. మరి ఈ తరలింపు యోచన వెనుక మతలబు ఏమిటి? గతంలో ముఖ్యమంత్రి గారు చేసిన ప్రకటనలో ఆ మతలబు ఏమిటో తెల్సిపోయింది. ముఖ్యమంత్రి గారు గోదావరి నీళ్ళు ఆంధ్రాకు, కృష్ణా నీళ్ళు రాయలసీమకు అన్నారు. హంద్రీనీవా, గాలేరునగరి, వెలిగొండ, తెలుగుగంగ, మొదలైన రాయలసీమ ప్రాజెక్టులకు నికర జలాల కేటాయింపులు లేవు. అవన్నీ కృష్ణా మిగులు జలాల మీద ఆధారపడి రూపొందించిన ప్రాజెక్టులే. వీటికి కేంద్రప్రభుత్వం అనుమతులిచ్చే ప్రసక్తే లేదు. అనుమతుల్లేని ప్రాజెక్టులకు కేంద్ర నిధులుగాని ఇతరత్రా రుణాల ద్వారానిధులు సమకూర్చడం సాధ్యం కాదు. అందుకని గోదావరి జలాలను కృష్ణాకు తరలించి శ్రీశైలం ద్వారా ఆ మేరకు కృష్ణా నీటిని రాయలసీమకు తరలించడమే గోదావరి–కృష్ణా నదుల అనుసంధానంలోని కుట్ర. ఇది కూడా తెలంగాణ రాష్ట్రం ఏర్పడే లోగా జరిగిపోవాలన్నది పలసపాలకుల తాపత్రయం. గోదావరి – కృష్ణా నదుల అనుసంధానం అంటే తెలంగాణ జలాల దోపిడీ ప్రక్రియ తప్ప మరొకటి కాదని ప్రజలు సమజు చేసుకోవలసి ఉన్నది.

**నదీజలాల కేటాయింపులో వివక్ష – ఇటీవలి ఘటన :**

ప్రాణహిత నది నుంచి 160 టిఎంసిలు, గోదావరి నదిలో దేవాదుల వద్ద నుండి 115 టిఎంసిలు, దుమ్ముగూడెం నుంచి 55 టింఎసిలు ఎల్లంపల్లి వద్ద లభ్యమయ్యే 63 టిఎంసిల నీటిని కలుపుకొని మొత్తం 395 టిఎంసి నీటిని తరలించి ఆదిలాబాద్, కరీంనగర్, నిజామాబాద్, మెదక్, నల్లగొండ, వరంగల్, రంగారెడ్డి, జిల్లాలోని కరువు పీడిత ఎగువభూములకు దాదాపు 32 లక్షల ఎకరాలకు సాగునీటితో పాటు వందలాది గ్రామాలకు, హైదరాబాద్ నగరానికి త్రాగునీటిని అందించే ఒక బృహత్తర పథకానికి రూపకల్పన చేసి ఇన్స్టిట్యూషన్ ఆఫ్ ఇంజినీర్స్‌కు చెందిన ఇంజనీర్లు ముఖ్యమంత్రికి సమర్పించినారు. ముఖ్యమంత్రి ఈ పథకానికి తన ఆమోదాన్ని తెలియజేయడమే కాదు ఆదిలాబాద్, నిజామాబాద్ రంగారెడ్డి జిల్లాల్లో అనేక సభల్లో ప్రాణహిత నీటిని తరలించే పథకాన్ని డిసెంబర్‌లోగా సర్వేలు పూర్తిచేసి జనవరి, 2006 నాటికి పనులు చేపడతామని ప్రకటించినారు. ముఖ్యమంత్రి గారి ప్రకటనల జ్ఞాపకాలు ప్రజల మెదళ్ళలోంచి తొలగిపోక ముందే సాగునీటి అధికారులు 160 టిఎంసిలకు బదులు 50 టిఎంసిల నీటిని తరలించేందుకు ప్రతిపాదనలు ప్రభుత్వానికి పంపినట్లు పత్రికలు వెల్లడించినాయి. పత్రికల్లో చదివిన ఇన్స్టిట్యూషన్ ఆఫ్ ఇంజనీర్స్ వారు నిర్ఘాంతపోయినారు. వారు మంత్రి గార్ని కల్సి వివరణ అడిగితే నాకేమి

తెలియదన్నారని పత్రికలు వెల్లడించినాయి. మంత్రి గారికి తెలియకుండానే ముఖ్యమంత్రిగారు ఆమోదించిన పథకం ఎందుకు తారుమారయినట్లు? ఇది ఆంధ్రా అధికార యంత్రాంగానికి ఉన్న పట్టును తెలియజేస్తున్నది. ఇంజనీర్ల ఒత్తిడి ఫలితంగా, ముఖ్యమంత్రి గారి జోక్యంతో తిరిగి 160 టిఎంసిలకే మంత్రిగారు ఆదేశాలివ్వడం వేరే కథ. ఇక్కడ గమనించవలసిన విషయం ఏమిటంటే నీటి కేటాయింపుల విషయంలో తెలంగాణకు వివక్ష, అన్యాయం ఎల్లప్పుడూ వెంటాడుతూనే ఉంటాయి. ప్రజలు, విద్యావంతులు, మేధావులు అప్రమత్తంగా ఉండి ప్రతిఘటించక పోయినట్లయితే నీటి చౌర్యం నిరాఘాటంగా సాగిపోతూనే ఉంటుంది. ఎగువన కర్నాటక, మహారాష్ట్రలు నీటిని ఆపేసి అన్యాయానికి పాల్పడుతుంటే దిగువన ఆంధ్రకు నీరుకి అంతకంటే ఎక్కువగా తరలిపోతుంది. అయితే రాజకీయ వాదులు మాత్రం బాబ్లీ ప్రాజెక్టులను చూపి మహారాష్ట్ర కర్నాటక వల్లనే తెలంగాణ అన్యాయమైపోతున్నదని గగ్గోలు పెడతారు తప్ప దిగువన జరుగుతున్న భారీ నీటిదోపిడీని ప్రశ్నించే సాహసం చెయ్యరు. బాబ్లీ ప్రాజెక్టు ఆగిపోయినంత మాత్రాన్నే తెలంగాణకు జర్గుతున్న అన్యాయం సమసిపోదు. దిగువన నీటి దోపిడీ కూడా ఆగిపోయి న్యాయబద్ధమైన కేటాయింపులు జరిగినపుడే తెలంగాణకు న్యాయం జరుగుతుందన్న సంగతిని ప్రజలు గమనించాలి.

**మనకర్తవ్యం**

తెలంగాణలో విస్తారమైన జలవనరులు ఉన్నప్పటికీ ఈ ప్రాంతం తీవ్రమైన వివక్షకు అన్యాయానికి గురి అయ్యిందన్న వాస్తవాన్ని గుర్తు చేసుకున్నపుడల్లా సమైక్యాంధ్ర వలసపాలకులకన్నా నిజాం నవాబులు, అంతకుముందు కుతుబ్‌షాహీలు, కాకతీయులే నయం అన్న విషయం మనసుకు తట్టక మానదు. సమైక్యాంధ్రలో న్యాయం నేతి బీరకాయలో నెయ్యిని ఊహించడం లాంటిది. అందువల్ల కృష్ణా గోదావరి జలాల్లో న్యాయమైన వాటాకోసం ఉద్యమిస్తూనే తెలంగాణ ప్రజల చిరకాల ప్రజాస్వామిక ఆకాంక్ష అయిన ప్రత్యేక తెలంగాణ రాష్ట్రాన్ని సాధించే దిశగా ముందుకు సాగడం అవసరం. అందుకోసం ఐక్యంగా ఉద్యమించడం మనందరి కర్తవ్యం.

తెలంగాణ నీటివనరులపై తెలంగాణవాసులకే ఆధిపత్యం లభించినపుడే వాటి సద్వినియోగం కోసం పథకాలు రూపొందించుకోగలం. అందుకోసం రాజ్యాధికారం తప్ప మరో మార్గమే లేదు.



# వివాదాల సుడిగుండంలో పోలవరం

**- ఆర్. విద్యాసాగర రావు**

ఆంధ్రుల చిరకాల స్వప్నం పోలవరం. ఇదే అలనాటి రామాపాద సాగరం. గత ప్రభుత్వాలు ప్రాజెక్టును ఆవిష్కరింపచేయడానికి చేసిన ప్రయత్నాలు నిష్ప్రయోజనమయ్యాయి. కేంద్ర ప్రభుత్వం, పొరుగు రాష్ట్రాలు, స్వరాష్ట్రంలోనే ముంపుకు గురికానున్న బాధితులు, ముఖ్యంగా గిరిజనులు లేవనెత్తిన అభ్యంతరాలు అడ్డంకులను సృష్టించిన నేపథ్యంలో ఈ ప్రాజెక్టుకు నూకలు చెల్లాయని అనుకుంటున్న తరుణంలో ముఖ్యమంత్రి వై.ఎస్. రాజశేఖర్ రెడ్డి 'రూల్ గీల్స్ జాన్తా నై... అన్నిటికీ నేనున్నాను. కమాన్ ప్రొసీడ్' అంటూ కమాండర్ మాదిరిగా ప్రాజెక్టును సాకారం చేయడానికి చేస్తున్న కృషిని అభినందించాలో, అభిశంసించాలో అర్థం కావడం లేదు. ఆయన ప్రయత్నాలు ఫలిస్తే జనం ఆనందిస్తారనడంలో ఏమాత్రం సందేహం అక్కరలేదు. అయితే, ఆయన వ్యూహం ఏ కారణం చేతనైనా బెడిసికొట్టి ప్రాజెక్టు మధ్యలో ఆగిపోతే అదే ప్రజ తీవ్రంగా నిరసిస్తారనడంలోనూ సందేహం లేదు. పోలవరం ప్రాజెక్టు ఎదుర్కొంటున్న సమస్యలు, అడ్డంకుల గురించి తెలుసుకుంటే తప్ప ప్రస్తుత పరిస్థితి అర్థం కాదు. రాజమండ్రిలో ప్రభుత్వం ఏర్పాటు చేసిన బహిరంగ చర్చ సీతారామాంజనేయ యుద్ధంలోలోని మరో ఘట్టాన్ని తలపింపచేసిందే గానీ అసలు సమస్యలపైన అంతగా దృష్టి కేంద్రీకరించలేదు.

1946 - 47లో రామాపాద సాగరం ప్రాజెక్టును రూపొందించినప్పుడు 10 లక్షల 34ల ఎకరాలకు సాగునీరు, 150 మెగావాట్ల విద్యుదుత్పత్తి లక్ష్యంగా పెట్టుకున్నారు. కాని ఆ ప్రాజెక్టు ముందుకు సాగలేదు. ఆ తర్వాత అనేక ప్రత్యామ్నాయాలు ఆలోచించి

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తొలిసారిగా ఏప్రిల్ 1983లో పోలవరం డ్యాం, ఎడమకాలువకు ప్రతిపాదనలు పంపింది. ఆ తరువాత 1985 మేనెలలో ప్రాజెక్టు కుడికాలువ కోసం కేంద్రానికి ప్రతిపాదనలు పంపింది. ఈ ప్రాజెక్టు ప్రతిపాదనలు పరిశీలించిన కేంద్ర జల సంఘం అనేక తప్పులు ఎత్తి చూపివాటిని సరిదిద్దుకుని సవివరమైన నివేదికను అందచేయవలసింది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1990 జూలై నెలలో మళ్ళీ నివేదికను కేంద్ర జల సంఘానికి పంపించింది. అయితే సంఘం తొలుత లేవనెత్తిన సందేహాలు, అభ్యంతరాలకు సమాధానం ఇవ్వకుండా కేవలం ఎస్టిమేట్స్‌ను సవరించడం మాత్రమే జరిగింది. దాంతో కేంద్ర జల సంఘం రిపోర్టును మళ్లీ తిప్పి పంపింది. ఇలా 983 నుంచి ఇప్పటి దాకా కేంద్ర జల సంఘానికీ, మన ప్రభుత్వానికీ మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగాయే తప్ప కేంద్ర జల సంఘాన్ని సంతృప్తి పరచి ఆమోదాన్ని పొందలేకపోయింది. అంతర్ రాష్ట్ర నదిపైన రూపొందించిన ఏ భారీ ప్రాజెక్టుకైనా ఈ కింది అంశాలపై కేంద్రం ఆమోదాన్ని పొందడం తప్పనిసరి.

1. ముంపునకు గురయ్యే పొరుగు రాష్ట్రాల అనుమతి. 2. నీటిలభ్యత, సాగునీటి ప్రణాళిక, పంట విధానం, వ్యయానికి సంబంధించిన వివరాలు మొదలైనవి కేంద్ర జల సంఘం పరిశీలించాక కేంద్ర జల వనరుల మంత్రిత్వ శాఖ సాంకేతిక సలహా సంఘం ఇచ్చే అనుమతి. 3. కేంద్ర అటవీ, పర్యావరణ మంత్రిత్వ శాఖ అనుమతి. 4. గిరిజనులు ముంపుకు గురవుతే వారి పునరావాస కార్యాచరణ ప్రణాళికను పరిశీలించి కేంద్ర గిరిజన సంక్షేమ మంత్రిత్వ శాఖ ఇచ్చే అనుమతి. 5. పై అనుమతులు పొందాక చిట్టచివరగా ప్రణాళిక సంఘం ఇచ్చే ఇన్వెస్ట్‌మెంట్ క్లియరెన్స్.

పోలవరం విషయానికొస్తే పైన చెప్పిన ఏ ఒక్క అనుమతీ కూడ దానికి లేదు. అయితే పనులు మాత్రం ముమ్మరంగా జరుగుతున్నాయి. ఇది మంచికే దారితీస్తుందో, చెడునే చేస్తుందో భవిష్యత్తే నిర్ణయిస్తుంది. పోలవరం గురించి ఏ చర్చ జరిగినా బచావత్ ట్రిబ్యునల్ రిపోర్టు పరిధిలోనే జరగాలని గుర్తుంచుకోవాలి. గోదావరి జలాల పంపకాన్ని చట్ట రీత్యా క్రమబద్ధీకరించిన బచావత్ ట్రిబ్యునల్ రిపోర్టులో పోలవరం ప్రాజెక్టుపైన ప్రత్యేకంగా ఒక చాప్టర్‌నే కేటాయించింది. గోదావరి జల వినియోగంపైన వివిధ రాష్ట్రాల మధ్య కుదుర్చుకున్న ఒప్పందాలనే ఒక చోట చేర్చి ట్రిబ్యునల్ తమ రిపోర్టును ఇచ్చింది. ఈ ఒప్పందాలలో 1980 ఏప్రిల్ 2న సంబంధిత రాష్ట్రాల కుదుర్చుకున్న ఒప్పందం ప్రధానమైదని. ట్రిబ్యునల్ తమ నివేదికలోని 'అంతిమ ఆదేశాల'లో పోలవరం గురించి ప్రస్తావించిన అంశాలు ఇవి.

**క్లాజు–6–ఒకటి** : (అ) పోలవరం పూర్తి జలస్థాయి / అత్యధిక జలస్థాయి + 150 అడుగులతో ప్రాజెక్టుకు సత్వరం కేంద్ర జల ఒప్పందం ఆమోదముద్ర వేయాలి. (ఆ) 1980 ఏప్రిల్ 2 నాటి ఒప్పందం, ఇంకా వివిధ ఒప్పందాలను దృష్టిలో



ఉంచుకుని సాధ్యమైనంత మేరకు కేంద్ర జల సంఘం 'పోలవరం ప్రాజెక్టు డ్యామ్ డిజైన్‌ను, డ్యాం ఆపరేషన్ షెడ్యూల్‌ను ఖరారు చేయవలసి ఉంటుంది. (ఇ) 1980 నాటి ఒప్పందంలో నిర్ణయించిన మేరకు ఖరారు చేయవలసిన డ్యామ్ ఆపరేషన్ షెడ్యూల్‌లో ఏదైనా మార్పు ఉంటే దాన్ని ఒరిస్సా, ఆంధ్రప్రదేశ్, చత్తీష్‌గడ్ (మధ్యప్రదేశ్) రాష్ట్రాలను సంప్రదించాకే చేయాలి. ఏదేమైనా పోలవరం డ్యామ్‌కు సంబంధించిన విషయాలను సంపూర్ణంగా కేంద్ర జల సంఘానికే వదిలేయాలి.

రెండు : పోలవరం ప్రాజెక్టుకు సంబంధించి పైన పేర్కొన్న సబ్‌క్లాజు (1)లోని రక్షణల (సేఫ్‌గార్డ్స్)తో సహా అన్ని రక్షణలను, కేంద్ర జల సంఘం నిర్దేశించినట్టుగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కల్పించవలసి ఉంటుంది.

ట్రిబ్యునల్ అంతిమ ఆదేశం అంటే సుప్రీంకోర్టు డిక్రీతో సమానం. ట్రిబ్యునల్ ఆదేశాలను ఉల్లంఘించడమంటే సుప్రీంకోర్టు ఉత్తర్వును ఉల్లంఘించినట్టే. పైన ఉటంకించిన విషయాలను చూస్తే పోలవరం ప్రాజెక్టు డ్యామ్ డిజైన్, ఆపరేషన్ షెడ్యూల్, ఆ డ్యామ్‌మూలంగా పొరుగు రాష్ట్రాలకు నష్టాల విషయంలో తీసుకోవాల్సిన జాగ్రత్తలు, రక్షణలకు సంబంధించిన అన్ని విషయాలను కేంద్ర జల సంఘానికే వదిలేయాలన్నది ట్రిబ్యునల్ ఆదేశమని స్పష్టంగా తెలుస్తోంది.

కేంద్ర జలసంఘం లెవనెత్తిన ముఖ్యమైన అభ్యంతరాలకు మన రాష్ట్రం సంతృప్తికరంగా సమాధానాలు చెప్పలేకపోతోంది. వివరాలు సంక్షిప్తంగా ఇవీ 1. పోలవరం ప్రాజెక్టు 75 శాతం సక్సెస్ ప్రాతిపదికన ఆయకట్టుకు నీరందించాలంటే ఇంద్రావతి నదిపైన బోధ్‌ఘాట్ ప్రాజెక్టు, ఇచ్చంపల్లి ప్రాజెక్టులు తప్పనిసరి. ఆరెండు ప్రాజెక్టులు లేకుండా 75 శాతానికి బదులు 45 శాతం సక్సెస్ ప్రాతిపదికనే సాగు నీరందుతుంది. 2. వివిధ పంటలకు అవసరమైన నీటి పరిణామాల గురించి జల సంఘం లేవనెత్తిన అభ్యంతరాలకు ఇంతవరకు జవాబు ఇవ్వలేదు. 3. పైన చెప్పిన అంశాలే కాకుండా డిసెంబరు 1987 నాటి ఉత్తరంలో కేంద్ర జల సంఘం వెలిబుచ్చిన సందేహాలను నివృత్తి చేస్తూ సవివరమైన నివేదికను రూపొందించవలసిన అవసరముంది.

కేంద్ర జల సంఘానికి తగు రీతిన సమాధానపరుస్తూ, డిటైల్డ్ ప్రాజెక్టు రిపోర్టు (డిపిఆర్) పంపటానికి బదులు నవంబరు 2003లో తాము డ్యామ్ డిజైన్‌లో మార్పులు చేశామనీ, స్పిల్‌వే ఎత్తు తగ్గించడం ద్వారా పొరుగు రాష్ట్రాలతో ముంపు పేచీ ఉండదని, కనుక ప్రాజెక్టుకు వెంటనే ఆమోదం తెలపమని మన ప్రభుత్వం కోరింది. ఆ కొత్త డిజైన్ ఏమిటో తమకు పంపాలనీ,దాని ప్రతులను పొరుగు రాష్ట్రాలకు కూడా పంపాలనీ జలసంఘం కోరగా దానికి మనం ఇంతవరకూ జవాబు ఇవ్వలేదు. పైగా 'ఇతర రాష్ట్రాల వ్యవహారాలు మేం చూసుకుంటాం. మీరు అనుమతివ్వండి' అంటూ ఈ మధ్యనే కోరాము – అదేం కుదరదని కూడా జలసంఘం ఈ ప్రతిపాదనను నిర్ద్వంద్వంగా తోసిపుచ్చింది.

ఈ నేపథ్యంలో ప్రభుత్వం ఏమనుకుందో ఏమో గానీ, అన్ని నియమనిబంధనలనూ తోసిరాజని మన ప్రభుత్వం ఈ బృహత్ పథకాన్ని చేపట్టింది. చేపట్టడమే కాదు, పోలవరం ప్రాజెక్టు విషయంలో ఇష్టానుసారంగా మార్పులు కూడా చేసింది వాటి వివరాలు ఇవీ.

1. పోలవరం ప్రాజెక్టు ఆలస్యమవుతుందని తాత్కాలికంగా రైతాంగానికి వెసులుబాటు కల్పించాలని గోదావరికి ఇరుపక్కలా తాటిపూడి, పుష్కరం పనులు చేపట్టింది. పోలవరం ఆయకట్టులో భాగమైన తాటిపూడి, పుష్కరం పనులు ఎందుకు చేపడుతున్నారో అర్థం కావడం లేదు. వాటికీ కాలువలు తవ్వుతున్నారు. పోలవరానికీ తవ్వుతున్నారు. కేంద్ర జల సంఘం ఈ ప్రశ్నే అడిగితే సంతృప్తికరంగా సమాధానాలు ఇవ్వలేదు. పైగా తాటిపూడికి పుష్కరానికీ జలసంఘం సవివరమైన నివేదిక రూపొందించేందుకు ఇచ్చిన ప్రథమ దశ క్లియరెన్స్‌ని ఫైనల్ క్లియరెన్స్‌గా చూపి తప్పుడు ప్రచారం చేస్తున్నారు.

2. పోలవరం ప్రాజెక్టు రిపోర్టులో చూపెట్టిన ఆయకట్టు 7.20 లక్షల ఎకరాలు. జలసంఘానికి పంపిన నివేదికలో అదే ఉంది. అకస్మాత్తుగా మరో 16 లక్షల ఆయకట్టు జోడించి లిఫ్ట్ ద్వారా గోదావరి జలాలను మళ్ళిస్తామంటున్నారు. ఈ విషయాన్ని కేంద్రానికి చెప్పకుండా దాచిపెట్టారు.

3. డిజైన్‌ను ఇపిసి పద్ధతిలో కాంట్రాక్టర్లకు అప్పగించారు. అంటే జల సంఘం ప్రమేయం లేకుండా వీరూ, ఇంజనీర్లు డిజైన్ ఖరారు చేస్తారన్న మాట. పక్క రాష్ట్రాలు అభ్యంతరం పెడితే ఏమవుతుందో ఎవరికీ తెలియదు.

4. 16 లక్షల అదనపు ఆయకట్టుకు ఎంతలేదన్నా 160 నుంచి 250 టిఎంసిల నీరు అవసరముంటుంది. ఈ నీరు ఎక్కడ్నించి వస్తుందంటే వరద జలాలను ఉపయోగించుకుంటాం అంటున్నారు. వరదజలాలను ఉపయోగించుకోవాలంటే ఆన్‌లైన్ రిజర్వాయర్లు కావాలి కదా అంటే మౌనం వహిస్తారు.

డిజైనుకు సంబంధించిన అంశాలు ఒకటైతే పోలవరం ముంపు బాధితులు, ముఖ్యంగా గిరిజనుల సమస్యలను మానవతాదృక్పథంతో ఆలోచించాల్సిన అవసరం ఉంది. అధికారం ఉందికదాని దురుసుగా వ్యవహరిస్తే పరిణామాలు భయంకరంగా ఉండే అవకాశముంది. ఇప్పటికైనా ప్రభుత్వం సొంత లాభం కోసం సలహాలిచ్చే నిపుణుల సలహాలను పక్కనబెట్టి, ప్రాజెక్టు డిజైన్‌ను కేంద్ర జల సంఘానికి వదిలిపెట్టి, పక్క రాష్ట్రాల నుంచి అనుమతి పొంది అటు తెలంగాణ జిల్లా రైతాంగానికి, ఇటు గోదావరి డెల్టా రైతాంగానికి ఎటువంటి నష్టమూ వాటిల్లకుండా కొస్త ఆలస్యమైనప్పటికీ అన్ని జాగ్రత్తలూ తీసుకున్నాకే ప్రాజెక్టు కడితే మంచిది. అంతేగానీ కొందరు స్వార్థపరుల లబ్ధికోసం రాష్ట్ర ప్రయోజనాలనూ, ప్రజాధనాన్నీ, విలువైన సమయాన్నీ వృథా చేస్తే ప్రజలు క్షమించరు.

('ఆంధ్రజ్యోతి' సౌజన్యంతో)



# 'పులిచింతల' కన్నా 'టేల్‌పాండ్' మిన్న

- ఎజికె ప్రసాద్

అతి వివాదాస్పదంగా మారిన పులించింతల ప్రాజెక్టు నిర్మాణ పథకంలోని ప్రతిపాదనల దృష్ట్యా ముఖ్యమంత్రి డా॥ రాజశేఖర రెడ్డి జాగరుకతతో ప్రకటనలు చేయవలసిన అవసరం ఏర్పడింది. ఎందుకంటే ఈ విషయమై అసెంబ్లీలో ఆయన చేసిన ప్రస్తావనకూ, కృష్ణా జిల్లా పర్యటనలో (జూలై 2004న) చేసిన ప్రకటనకూ వైరుధ్యం కనిపిస్తోంది. గోదావరి జలాల్ని వాలుకాలువల ద్వారా కృష్ణా నదిలోకి మళ్ళించడం ద్వారా 80శతకోటి ఘనపుటడుగుల నీటితో 25లక్షల ఎకరాలు సాగుచేయవచ్చునని, ఇది టేల్‌పాండ్ నిర్మాణం ద్వారా సాధ్యమయ్యే పక్షంలో తప్పనిసరిగా ఆలోచిస్తామని రాజశేఖర్ అసెంబ్లీలో ప్రకటించినట్టు వార్తలొచ్చాయి. అయితే ఆయన కృష్ణా జిల్లా పర్యటనలో 'లక్షలాది ఎకరాలకు సాగునీటిని అందించే పులించింతల ప్రాజెక్టును పూర్తిచేయడం అవసరమని చెప్పినట్టు కూడా వార్తలు, అసలే వివాదాస్పదంగా ఉన్న పులిచింతల గురించిన ఏ చింతనకు లోనైనా స్పష్టత అవసరం. ఎందుకంటే గతంలో బ్రిటీష్ ఇంజనీర్లు మెకంజీ కర్నల్ ముల్లింగ్స్ ఎల్లింగ్‌లు పులిచింతల పథకం తలపెట్టే నాటికి (1870లలో) నాగార్జునసాగర్ ప్రాజెక్టు గాని, శ్రీశైలం ప్రాజెక్టు గానీ లేవు. అది దేశ స్వాతంత్ర్యానికి పూర్వపు పరిస్థితి. కాగా 1950లలో కూడా తమిళనాడు ప్రభుత్వం ప్రభుత్వం (రాజాజీ) కుట్రఫలితంగా అవతరించబోయిన కృష్ణా పెన్నార్ ప్రాజెక్టుకు ప్రజాందోళన కారణంగా గండిపడడం వల్ల దాని స్థానంలో నాగార్జునసాగర్ ప్రాజెక్టుకు తెలుగు ప్రజలు సాధించుకోగలిగారు. మొత్తం రాష్ట్రం మనుగడ నేడు రెండు ప్రధాన నదులు కృష్ణా, గోదావరి జలపపంకంపైన ఆధారపడి

ఉంది. గతంలో బచావత్ ట్రిబ్యునల్ ఆంధ్రప్రదేశ్‌కు (జలవివాద పరిష్కారంలో భాగంగా) కేటాయించిన కృష్ణా జలాలు సుమారు 811 శతకోటి ఘనపుటడుగులు. వీటిని ఇప్పటికే వాడుకుంటున్నాం. కర్ణాటక, మహారాష్ట్రలు వాడుకోగా మిగిలిన కృష్ణా జలాలను వాడుకునే స్వేచ్ఛను మాత్రం ట్రిబ్యునల్ మనకిచ్చి అది 'హక్కు' కాదంది.

కర్నల్ ముల్లింగ్స్ పథకమూ, 1951 తర్వాత మాజీ కేంద్రమంత్రి ఇంజనీర్, జలవిద్యుత్ వ్యవహారాల నిపుణుడు కె.ఎల్.రావు పథకమూ – బచావత్ ట్రిబ్యునల్ సాగర్ ప్రాజెక్టు దరిమిలా మారిన పరిస్థితులలో ఈ మిగులు జలాల సమస్య తెగని సమస్యగా ఆధారపడదగిన కృష్ణాజల రాశి పరిణామం 'దేవాతావస్త్రాల' కథగా మిగిలిపోతున్న దశలో 'పులిచింతల' ప్రాజెక్టు ప్రతిపాదనకు సంబంధించిన ఆలోచనలు కూడా మారకతప్పదు. కృష్ణా, గుంటూరు, నల్గొండ జిల్లాలోని అనేక మెట్ట ప్రాంతాల ప్రజలు ఒక్క పంటకు కూడా సరిగ్గా నోచుకోని దశలో, కృష్ణాలో రెండవ పంటలకు నీరందించే పేరిట. పులిచింతల రిజర్వాయర్ అనండీ. ప్రాజెక్టు అనండీ నిర్మించాలన్న ఆలోచన తన కడుపునిండితే చాలు నన్న ధోరణిని ప్రోత్సహించడమే అవుతుంది. ఆంధ్రప్రదేశ్‌కు గోదావరి నదీ జలాల్లో కేటాయించిన 1480 శతకోటి ఘనపుటడుగుల (టి.ఎం.సి) కేవలం 720 టిఎంసి కాగా, నిర్మాణంలో ఉన్న ప్రాజెక్టులకు వినియోగించాల్సిన 115 టిఎంసిలు పోగా, మిగిలిన 645 టింఎంసిలు నీరు సముద్రంలో కలిసిపోతుంది. అలాగే 30,40 ఏళ్ల క్రితం కృష్ణలో ఆధారపడదగిన నీరు 75శాతం అని అంచనా వేసి, అది ఆధారంగా కృష్ణలో 2060 టిఎంసి నికరజలాలు ఉంటాయని ఆలోచనలు చేయగా ఆచరణలో ఆధారపడదగిన అసలు అంచనా 1745 టిఎంసి లకు దిగజారిపోయింది. ఈ సత్యాన్ని మరిచి ఎవరికివారు తోచిన అంచనాలను ఆశ్రయించారు. ఫలితం – ఏ ప్రాజెక్టు అంచనాకు అనుభవానికి అందకుండా పోవడం ! హక్కులేకుండా 'స్వేచ్ఛ' మీద మాత్రమే ఆధారపడి తెలుగుగంగ, ఎస్ఎల్‌బిసి (మాధవరెడ్డి) ఎస్ఆర్‌బిసి, భీమ ఎత్తిపోతల, పులిచింతల ప్రాజెక్టు (నల్లగొండ – గుంటూరు జిల్లాల మధ్య) పథకాలు తలపెట్టుకున్నాం ! దీనిపై మనకూ, కర్నాటక, మహారాష్ట్రల మధ్య జలపంపిణీ వివాదాలు ముదిరాయి. ఎన్‌టిఆర్ నాయకత్వంలో 'దేశం' ప్రభుత్వం పులిచింతల ప్రాజెక్టు బదులు రిజర్వాయర్ నిర్మాణానికి శంకుస్థాపన చేసినప్పుడు మొత్తం కృష్ణ, గుంటూరు, నల్లగొండ జిల్లాలోని మెట్ట ప్రాంతాల ప్రజలు నిరసన తెలపడానికి కారణం – పులిచింతల పేరిట ఒనగూడే ప్రయోజనం కొందరికి మాత్రమేనన్న అభిప్రాయం. అసలు 'పులించింతల' నిర్మాణంపైన దాగి వున్న అసలు ప్రమాదం – మూడు జిల్లాలలోని 35 గ్రామాలకు పైగా మునిగిపోతాయి. 60వేల మంది జనాభా నిర్వాసితులయ్యారు. సాగుకు వీలయిన 4,500 ఎకరాలకు పైగా



మునిగిపోతాయి. ఇంతవరకూ దేవాలయ అటవీభూముల్ని, బంజరు భూముల్ని సాగుచేసుకునే పేదలు నిరాశ్రయులవుతారు. అందువల్లనే 'పులిచింతల' నిర్మాణానికి అంత ప్రాతికూల్యం వచ్చింది. అంతేగాదు. గత పాతికేళ్ళుగా అనేక గ్రామాల ప్రజలు (మూడు జిల్లాల్లో) 'పులిచింతల' కన్నా ఎత్తిపోతల పథకాలకు ప్రాధాన్యం ఇవ్వాలని ఆందోళన చేస్తూ వచ్చారు. కృష్ణా జిల్లాలో నీటికొరత ఏర్పడిన సంవత్సరాల్లో కేటాయింపులోని 800 టింఎంసిల నీటిని కూడా పొందడం కష్టమవుతోందన్న గుర్తింపు అవసరం. ఈ సమస్యలపై ఏడెనిమిది సంవత్సరాలుగా అఖిలభారత 'పీపుల్స్ ఫోరమ్' గుంటూరు జిల్లా కాంగ్రెస్ 'రాజీవ్ టేల్‌పాండ్' పోరాటసమితి ఆందోళన చేయడం గమనార్హం. నాగార్జునసాగర్ ప్రాజెక్టు కింద భూముల్ని ఖాళీచేసిన వారిలో అనేకమందికి నష్టపరిహారం 2003 వరకూ అందని సమయంలో, పునరావాసం సమస్యగా మారినందున కూడా పులిచింతల కొరివితో పాలకులు తలగోక్కొాదదు.

## 'టేల్‌పాండ్' వైశిష్ట్యం

ఇంతవరకూ సాగర్, శ్రీశైలం జలాశయాలను విద్యుత్ ఉత్పత్తి పేరిట మాడ్చుతూ ఆయకట్టు రైతులకు రెండు మూడు నెలలు ఆలస్యంగా నీరందించడం, రబీకి నీరు అసలు వదలకపోవడం, రైతులు న్యాయస్థానాన్ని ఆశ్రయించి, నీటిని విడుదల చేయించుకోడం – ఇటీవల దారుణానుభవాలు, ఇక పైర్లువేసుకోలేని అనేకమంది రైతులు, వారిపై ఆధారపడిన వ్యవసాయ కార్మికులు మనుగడ కోసం అగచాట్లు పడవలసి వచ్చింది. అటు సాగర్‌ను ఎండగట్టుకొని నల్లగొండ, ఖమ్మం, గుంటూరు, ప్రకాశం జిల్లాల రైతాంగాన్ని పాలకులు దెబ్బతీశారు. మరోవైపు నుంచి శ్రీశైలం జలాశయాన్ని ఎండగట్టి రాయలసీమకు దక్కాల్సిన శ్రీశైలం కుడికాలువ, తెలుగు గంగ నీటిని అడ్డుకోవడం అక్కరకు రాని 'కుందేటికొమ్ము' లాంటి 'గంగా కావేరి' అనుసంధానం గురించి ఊదరగొట్టి ప్రజలను ఊరడించడానికి మొన్నటి దాకా పాలకులు కాలక్షేపం చేశారు. అయితే తాజాగా 'రాజీవ్‌గాంధీ టేల్‌పాండ్ నిర్మాణ పోరాటసమితి' తరపున కన్వీనర్ రాజాకాశయ్య నిపుణుల సహకారంతో రూపొందించిన పథకం ప్రకారం (ఈ పథకాన్ని ఇంజనీర్లు 1984లోనే ఆలోచించారు) గోదావరి నదిపై కాంతాలపల్లి వద్ద పూర్తి రిజర్వాయర్ స్థాయిలో డ్యాం నిర్మించాలి. అక్కడి నుండి సాగర్ టేల్‌పాండ్ డ్యాం దాకా కృష్ణ గోదావరి అనుసంధాన ప్రధాన కాలువలను నిర్మించుకోవాలి. ఆ కాలువ బెడ్‌లెవల్ 70 మీటరు ఉంటుంది కాబట్టి, కృష్ణా డెల్టాకు కావలసిన 200 టిఎంసిల నీటిని ఖరీఫ్ పంటకు గోదావరి నుంచి ప్రవహింప చేసుకోవచ్చు. అలాగే ఖమ్మం, నల్గొండ జిల్లాలోని సాగర్ ఎడమకాల్వకు దిగువన ఉన్న భూములకు, కృష్ణ పశ్చిమగోదావరిలోని ఎడమ కాల్వకు దిగువన ఉన్న భూములకు, కృష్ణ, పశ్చిమగోదావరిలోని ఎడమ కాల్వ కింద భూములకు 100 టిఎంసి నీటిని

వాడుకోవచ్చు. వీటిని ఎత్తిపోతల అవసరం లేకుండానే వినియోగించుకోవచ్చు. ఇలా వాడుకోగా మిగిల్చిన 300 టిఎంసి నల్లగొండకూ, మరో 100 టిఎంసిని రాయలసీమకూ ఉపయోగించుకోవచ్చు. ఈ పథకం ప్రకారం తరచుగా వరదలకు గురయ్యే గోదావరి నీటిని సాగర్‌లోని 7×100 మెగావాట్ల పంపులద్వారా చేర్చుకోవచ్చు. అలాగే 6×150 మెగావాట్ల శ్రీశైలం పంపుల ద్వారా సాగర్ నీటిని శ్రీశైలం రిజర్వాయర్‌లోకి చేర్చడమూ సాధ్యమవుతుంది. తద్వారా శ్రీశైలం ఆయకట్టునూ రక్షించుకోవచ్చు. ఈ టేల్‌పాండ్ పథకం వల్ల మైలారం వద్ద కృష్ణపైన అనకట్ట కట్టడం ద్వారా తెలంగాణ నుంచి హాలియాలో కలిసే ఉపనదులు పీతరవాగు, కొంగలవాగు, దండివాగు, గుఱ్ఱాలబావిబంధం, గోరివాగులు, మూసి ఉపనదిలో కలిసే చిన్నమూసి, పాలేరు, మూసి వగైరా వాగులూ మున్నేరులో కలిసే అక్కెరు, వట్టివాగు, బుగ్గలవాగు, వైరా వగైరాలూ కలుస్తాయి. ఇక ఆంధ్రవైపు నుండి చంద్రవంక, నాగులేరు, విట్టవాగు వగైరా ఎనిమిది వాగులు కూడా వచ్చి మైలారం ఆనకట్టవద్ద కలుస్తాయి. అలాగే గుంటూరు జిల్లానుంచి వచ్చి చేరు నీరు వృధాగా సముద్రంలో కలవకుండానూ అరికట్టవచ్చు. తెలంగాణాలోని కరీంనగర్, వరంగల్ నల్లగొండ ఖమ్మం జిల్లాలోని కృష్ణా పరివాహక ప్రాంతంలో కురిసే వర్షపు నీరు గుంటూరు జిల్లా నుంచి వచ్చి చేరే నీటి పరిమాణం ఏడాదిలో 200 టిఎంసి కన్నా ఎక్కువ ఉంటుందని అంచానా. ఇందుకు మైలారం డ్యాం ఎంతో ఉపయోగపడుతుందని నిపుణుల నిర్ధారణ. ఇలాంటి బహుళార్థకమైన ప్రాజెక్టును గత 20 సంవత్సరాలుగా ఎందుకు ఉపయోగంలోకి తెచ్చేకోలేదో అనూహ్యం. పైగా 'టేల్‌పాండ్' పథకానికి అన్ని రకాల అనుమతులు (పర్యావరణ అనుమతి, ప్రాజెక్టు అనుమతి సహా) 1984 నాటికే లభించి రూ. 351కోట్ల మేరకు ప్రాజెక్టుకు 1994 నాటికే నిధులు మంజూరు అయినా ఎందుకు తాత్సారం జరగాలి? ఈ పథకాన్ని అమలులోకి తెచ్చుకుంటే 'పులిచింతల' వల్ల జరిగే డజన్లకొద్దీ ఊళ్ళూ, సేద్యపు భూములు మునిగిపోయే ప్రమాదాన్ని తప్పించుకోవచ్చు.

('వార్త' సౌజన్యంతో)

08.07.04



# నిర్లక్ష్యానికి గురైన తెలంగాణ వ్యవసాయ రంగం

- యం. కోదండరామ్

తెలంగాణ రైతులు తమ కొరకు తాము వ్యవసాయం చేసుకున్నన్ని రోజులు బాగానే ఉన్నారు. కాని మంది కొరకు వ్యవసాయం మొదలు పెట్టినప్పటి నుండే చితికి పోతున్నారు. తన కొరకు తాను వ్యవసాయం చేసుకున్నన్ని రోజులు రైతు ఉత్పత్తికి కావలసిన కారకాలను అంగట్లో కొనలేదు. పొలంలో పండిన పంటలో కొంతభాగాన్ని విత్తనాలుగా ఉపయోగించాడు. పశువుల పెంటనే ఎరువుగా వాడుకున్నారు. మందులు మాకులు తెలియవు. కాబట్టి అంగటికి పోయే అవసరం రాలేదు. ఉత్పత్తి రైతు నియంత్రణలో ఉండేది.

కానీ నేటి పరిస్థితి వేరు. వ్యవసాయం వ్యాపారీకరణ చెందిన తరువాత రైతుకు భూమికి ఉన్న సంబంధమే మారిపోయింది. గతంలో రైతులు తిండి అవసరాలను వాతావరణ పరిస్థితిని బట్టి, భూసారాన్ని బట్టి పంటలను ఎంచుకునేవారు. కాని ఇప్పుడు పైసలు ఇవ్వగల పంటలను వేస్తున్నారు. రైతుకు భూమికి కల సంబంధాన్ని మార్కెటు నిర్ధారిస్తున్నది.

ఈ పరిస్థితిలోనే రైతు జీవితాన్ని మార్కెటు శక్తులు శాసిస్తున్నాయి. విత్తనాల నుండి మొదలుకొని ఎరువులు, క్రిమిసంహారక మందుల దాకా ఉత్పత్తి కారకాలన్నింటిని మార్కెటులో కొంటున్నారు. ప్రతి ఒక్కటి అంగటిలో సరుకైంది. పైసలు పెట్టందే విత్తనాలు, మందులు దొరకవు.

మారుతున్న ఈ ఉత్పత్తి వ్యవస్థలో రైతు ఆదాయం అతనికున్న వనరులు, కొత్త పంటలను పండించగల నైపుణ్యం, మార్కెటులో పండిన పంటను అమ్ముకోగల

శక్తి, నాణ్యమైన ఉత్పత్తి కారకాలను సమకూర్చుకొనే సామర్థ్యం మీద ఆధారపడి ఉన్నది. రైతు కొత్త పంటలను పండించడానికి కావలసిన సాగు పద్ధతులను నేర్చుకోవాలి. వర్తకుల నుండి నాణ్యమైన కారకాలను సాధించుకోవాలి. పండిన పంటను వర్తకుల మోసాలకు గురికాకుండా లాభసాటిగా అమ్ముకోవాలి. ఇవన్నీ సాధ్యమైతేనే వ్యవసాయం చేయగలరు.

మరి అటు మార్కెటుతోని తలపడడం, ఇటు కొత్త సాగు పద్ధతుల మీద పట్టు సాధించడం రైతు ఒక్కనితో అయ్యేపని కాదు. ప్రభుత్వం సాయం లేకుండా రైతు నెగ్గుకొని రాలేడు. రైతు పట్ల ప్రభుత్వం అనుసరించే దృక్పథం వ్యవసాయ రంగాన్ని గణనీయంగా ప్రభావితం చేయగలదు. ప్రభుత్వం సానుకూలంగా ఉంటేనే రైతు బతుకుదెరువు పొందగలడు. అనువైన పంటలను, సాగు పద్ధతులను పెంపొందించడం ద్వారా, రుణసదుపాయాన్ని ఇతర వసరులను కల్పించడం ద్వారా, మార్కెటును అదుపుచేయడం ద్వారా ప్రభుత్వం రైతులను ఆదుకోవచ్చు. ఈ అంశాలను ఉపేక్షిస్తే రైతు దుష్టశక్తుల బారినపడిపోతడు.

ప్రభుత్వ విధానాలు ఆ ప్రభుత్వాన్ని నడిపే పాలకుల సామాజిక మూలాలను బట్టి నిర్ణయమైతది. మన రాష్ట్రంలో ప్రభుత్వాలకు ప్రధానంగా కోసాంధ్ర సంపన్న వర్గాలే పునాదిగా ఉన్నాయి. ఈ వర్గం కృష్ణా, గోదావరి నదులపై బ్రిటీష్ పాలకులు కట్టిన ప్రాజెక్టుల వలన ఆర్థికంగా ఎదిగింది. జమిందారీ వ్యతిరేక పోరాటాలతో రాజకీయంగా సంఘటితమైంది. స్వాతంత్రోద్యమం వలన, ఆంధ్రోద్యమ వలన రాజకీయంగా బలపడింది. సంస్కరణోద్యమాల వలన, హేతువాద ఉద్యమాల వలన, స్పష్టమైన ప్రాపంచిక దృక్పథాన్ని పెంపొందించుకోగలిగింది. అట్లా ఎదిగిన వర్గం ఉమ్మడి రాష్ట్రంలో అధికారాన్ని క్రమంగా విస్తరించుకున్నది. ఈ వర్గ ప్రయోజనాల రీత్యా మన రాష్ట్ర ప్రభుత్వ విధానాలు రూపొందినాయి.

తెలంగాణ రైతాంగం స్పష్టమైన రాజకీయ వ్యక్తికరణను పొందగలిగి ఉంటే పరిస్థితి వేరుగా ఉండేది. తెలంగాణ రైతాంగ ఉద్యమాలు దేశముఖులు, జాగీర్దార్లు, దొరల అధికారానికి వ్యతిరేకంగా సాగినాయి. ఈ ఉద్యమాలకు జాతీయోద్యమానికి ఎన్నడూ ప్రత్యక్ష సంబంధం ఏర్పడలేదు. కాబట్టి ఉద్యమాల ద్వారా సంఘటితం కాగలిగినా ఎన్నడూ రైతాంగం ప్రధాన స్రవంతిలో భాగం కాలేక పోయింది. దానికి వెలుపలే ఉండిపోయింది.

అందుకే 1956 తరువాత ఏర్పడిన ప్రభుత్వాలు కోస్తా ధనిక రైతాంగానికి సానుకూలంగా పనిచేసినాయి. భారీ ప్రాజెక్టుల కోసం 1950 - 2000 మధ్యకాలంలో ప్రభుత్వం సుమారు 8700 కోట్ల రూపాయలు ఖర్చు చేసింది. అందువలన సాగునీటి వసతిని పొందిన భూమిలో 77 శాతం కోస్తాంధ్రలోనే ఉన్నది. తెలంగాణ, రాయలసీమలలో



చెరువులు నీటిని అందించాయి. ఈ రకమైన చిన్న నీటిపారుదల రంగానికి 1950-2000 మధ్య కాలంలో కేవలం 1340 కోట్లు మాత్రమే ఖర్చు చేశారు. ఈ డబ్బు రోజు వారి నిర్వహణకు కూడా చాలలేదు. అందువలన చెరువులు కనీస మరమ్మతులకు నోచుకోలేదు. నిజాం కాలంలో విధిగా ప్రతి చెరువును 3 సంవత్సరాల కొకసారైనా మరమ్మతులు చేసేవారు. ఆ నియమాలు, చెరువులను పర్యవేక్షించే ఆ వ్యవస్థ కుప్పకూలి పోయాయి. ఆ విధంగా చెరువుల వ్యవస్థ క్షీణించిపోయింది. 1956లో 4,47,226 హెక్టార్లు చెరువుల కింద సాగుకాగా 2002 నాటికి అది 1,92,614 హెక్టార్లకు పడిపోయింది.

సాగునీటి సౌకర్యం బాగా పెంపొందడం వల్లనే కోస్తా జిల్లాల్లో హరిత విప్లవం వచ్చింది. బాగా సాగునీటి సౌకర్యం గల ప్రాంతాలలో, పెట్టుబడి కల రైతులనుద్దేశించి హరిత విప్లవాన్ని పెంపొందించారు. ప్రధానంగా వరి, పత్తి, గోధుమ వంటి పంటలలో అధిక దిగుబడిని సాధించడానికి కావలసిన పరిశోధనలు జరిగాయి. ఆ పంటల విషయంలో మేలైన విత్తనాలు, అనువైన సాగుపద్ధతులు వచ్చినాయి. ప్రభుత్వం ఈ ప్రాంతాలలోనే మరిన్ని మౌలిక సదుపాయాలను కల్పించింది. ఉదాహరణకు బ్యాంకుల ద్వారా అత్యధిక రుణం ఈ ప్రాంతాలకే అందజేస్తున్నారు. ఇప్పటికీ ఇదే పరిస్థితి కొనసాగుతున్నది.

(రూ. కోట్లలో)

| | రాయలసీమ | కోస్తాంధ్ర | తెలంగాణ | ఆంధ్రప్రదేశ్ |
|---|---|---|---|---|
| వాణిజ్య బ్యాంకులు | 1090.06 | 2858.84 | 2411.59 | 6360.49 |
| శాతము | 17.14 | 44.95 | 37.91 | 100 |
| రాష్ట్ర సహకార బ్యాంకులు | 74.122 | 133.810 | 69254 | 277186 |
| శాతము | 16.22 | 60.514 | 23.27 | 100 |
| జిల్లా సహకార బ్యాంకులు | 140.57 | 966.93 | 532.31 | 1639.81 |
| శాతము | 8.57 | 58.97 | 32.46 | 100 |

ఈ సంవత్సరానికి సహకార బ్యాంకుల నుండి విడుదలైన పంట రుణాలలో కూడా ఉభయగోదావరి, కృష్ణా జిల్లాలకు ఎంత మొత్తంలో రుణాలు మంజూరయ్యాయో తెలంగాణ జిల్లాలకు అంతే మొత్తం మంజూరైంది.

అంతేకాదు ప్రభుత్వం వరి పంటకు మార్కెటు కల్పించడానికి చూపిన శ్రద్ధ ఇతర పంటల విషయంలో చూపలేదు. ముఖ్యంగా రెండు రూపాయల కిలో బియ్యం పథకాన్ని ప్రవేశపెట్టి ప్రభుత్వమే వరి కొనుగోలు చేయడం వలన వరికి మార్కెటు

బాగా విస్తరించింది. ఇతర తృణధాన్యాలకు మార్కెటు పూర్తిగా పోయింది. అటు తిండికీ పనికి రాని ఇటు మార్కెటూ లేని జొన్న, సజ్జ వంటి పంటలను వేయడం వ్యర్థమని భావించి రైతులు ఆ పంటలను సాగుచేయడం మానుకున్నారు. అందుకే గత 25సంవత్సరాలలో తెలంగాణాలో సాగు పద్ధతులు పూర్తిగా మారిపోయాయి.

తెలంగాణలో పల్లపు ప్రాంతాల్లో మాత్రమే వరి సాగుచేసి మిగతా భూముల్లో పప్పుధాన్యాలు, తృణ ధాన్యాలు, నూనె గింజలు, పండించేవారు. ఈ పునాస పంటలో వేసే భూమిని మూడేళ్ళ కొకసారి పడావు పెట్టేవాళ్ళు. బావుల కింద పొగాకు వంటి వాణిజ్య పంటలు పండించుకున్నారు. ఇవికాక పశువుల మేతకు కంచెలు ప్రతి గ్రామంలోను ఉండేవి. హరిత విప్లవంలో భాగంగా పెంపొందిన సాగు పద్ధతులు, కోస్తాంధ్ర సంపన్న వర్గాలు అనుసరించిన వ్యవసాయ, సాగునీటి విధానాల వలన ఈ సాగు పద్ధతులు కుప్పకూలిపోయాయి.

ప్రత్యామ్నాయ పంటలు 1980 నుండి ప్రవేశించినాయి. ప్రధానంగా వరి, పత్తి, మిర్చి వంటి పంటలు విస్తరించాయి. అయితే ప్రభుత్వం నీటి సౌకర్యం కల్పించక పోవడం వలన ఈ పంటల సేద్యానికి రైతులే బావులు తువ్వుకోవలసి వచ్చింది. 1980ల తరువాతే బావుల సంఖ్య పెరిగింది. ఆ సంఖ్య ఎలా పెరిగిందో దిగువ పట్టికలో చూడవచ్చు. పట్టికలో బావులు, బోర్ల సంఖ్య కలిసి ఉన్నది.

**తెలంగాణ జిల్లాలలో బావుల సంఖ్య**

| | 1979-80 | 1984-85 | 1989-90 | 1992-93 | 1997-98 | 2000-01 |
|---|---|---|---|---|---|---|
| మహబూబ్ నగర్ | 61479 | 78265 | 84214 | 104422 | 125661 | 125155 |
| రంగారెడ్డి | 21375 | 48625 | 33043 | 45919 | 51041 | 57548 |
| మెదక్ | 50924 | 73919 | 75448 | 119220 | 61896 | 91700 |
| నిజామాబాద్ | 42710 | 56906 | 55222 | 60146 | 105377 | 121879 |
| ఆదిలాబాద్ | 15851 | 21589 | 21612 | 28771 | 33830 | 31557 |
| కరీంనగర్ | 158475 | 210336 | 163155 | 172603 | 180094 | 224956 |
| వరంగల్ | 127199 | 218271 | 154583 | 237653 | 186106 | 187611 |
| ఖమ్మం | 16665 | 28150 | 23520 | 34598 | 40525 | 41184 |
| నల్లగొండ | 64100 | 74456 | 93622 | 95273 | 129983 | 142823 |

తెలంగాణలో సాగునీటి సౌకర్యం కల 15లక్షల హెక్టార్లకు 10లక్షల హెక్టార్లు బావుల కిందే సాగవుతున్నది. 2001-02 సంవత్సరంలో తెలంగాణ, కోస్తాంధ్రలోని జిల్లాల్లో ఆయా సాగునీటి వసతుల కింద సాగైన భూమి విస్తీర్ణం (హెక్టార్లలో) దిగువ పట్టికలో చూడవచ్చు.





| ప్రాంతం | కాలువలు | చెరువులు | బోర్లు | బావులు | ఇతరములు | మొత్తం |
|---|---|---|---|---|---|---|
| శ్రీకాకుళం | 91424 | 57459 | 4671 | 8475 | 5007 | 167036 |
| విజయనగరం | 36096 | 64380 | 5640 | 7330 | 1970 | 115416 |
| విశాఖపట్నం | 34350 | 21813 | 5945 | 5128 | 24096 | 91332 |
| తూ.గోదావరి | 176901 | 19754 | 51547 | 1508 | 12255 | 261965 |
| ప.గోదావరి | 187613 | 1835 | 122010 | 15487 | 8373 | 335318 |
| కృష్ణ | 224584 | 15634 | 23077 | 16000 | 14185 | 293485 |
| గుంటూరు | 304863 | 6620 | 36155 | 4464 | 46854 | 368956 |
| ప్రకాశం | 72867 | 33710 | 51559 | 21835 | 25000 | 204971 |
| నెల్లూరు | 74201 | 75079 | 45813 | 35973 | 7379 | 238445 |
| మొత్తం | 1202904 | 296284 | 346417 | 116200 | 115119 | 2076924 |
| | (57.91) | (14.26) | (16.67) | (5.59) | (5.54) | |
| మహబూబ్ నగర్ | 16862 | 7402 | 98663 | 34518 | 6161 | 163606 |
| రంగారెడ్డి | 2849 | 2948 | 47405 | 17195 | 1507 | 71904 |
| మెదక్ | 2778 | 8079 | 100227 | 18364 | 761 | 130209 |
| నిజామాబాద్ | 24584 | 17988 | 114156 | 7135 | 4450 | 168313 |
| ఆదిలాబాద్ | 24180 | 21481 | 15467 | 14404 | 580 | 76112 |
| కరీంనగర్ | 64659 | 28897 | 7500 | 159504 | 2298 | 262858 |
| వరంగల్ | 3323 | 58819 | 35474 | 200653 | 3732 | 302001 |
| ఖమ్మం | 46178 | 33689 | 20018 | 34888 | 20295 | 155068 |
| నల్గొండ | 62748 | 13511 | 46732 | 58890 | 12249 | 194060 |
| మొత్తం | 248091 | 192814 | 485642 | 545551 | 52033 | 1524131 |
| | (16.7) | (12.65) | (31.86) | (35.79) | (3.41) | |

కోస్తాంధ్రలో 49శాతం సాగు భూమికి, తెలంగాణలో 37 శాతం భూమికి మాత్రమే సాగునీటి సౌకర్యం ఉన్నది. తెలంగాణలో సాగునీటి సౌకర్యం తక్కువగా ఉండటం ఒక విషయం కాగా బావుల కింద సాగువుతున్న భూమి ఎక్కువగా ఉండటం ఇంకొక ప్రధానాంశం. తెలంగాణలో సాగునీటి సౌకర్యం కల ప్రతి

నాలుగెకరాలలో సుమారు మూడెకరాలు బావుల కింద సాగవుతున్నది. కృష్ణా, ఉభయ గోదావరి జిల్లాల్లో సుమారు 5 లక్షల హెక్టార్లకు రెండవ పంటకు కూడా సాగునీరు అందుతున్నది. తెలంగాణలో కాలువల కింద ఒక పంటకు నీరు పొందుతున్న భూమి ఇందులో సగమేనని గుర్తించాలి.

బావుల కింద సేద్యము ఎన్నో కష్టాలతో కూడుకున్నది. నికరంగా నీరందుతుందన్న గ్యారంటీ లేదు. బావులు తవ్వుకోవాలంటే రైతు ఖర్చు భరించాలి. బావి తవ్వగానే సమస్యలు తీరవు. కొత్త సమస్యలు మొదలవుతాయి. కరెంటు సరిగా ఉండదు. కాబట్టి కరెంటు కొరకు బావి దగ్గర చూసుకుంటూ కూర్చోవాలి. ఒకవేళ వచ్చినా సగం పారే సరికి మళ్ళీ కరెంటు పోతది. కరెంటు వచ్చేసరికి ఆ తడిసిన భాగం ఎండిపోతది. కనుక మళ్ళీ మొదటి నుండి పారకం పెట్టుకుంట రావాలి. పొలానికంతటికి నీళ్ళు సర్దుకునుడే రైతుకొక పెద్ద సమస్య. అందువలన రైతు ఇంకొక పనిచేసుకోలేడు. ఇక మరొక సమస్య మోటార్ల నిర్వహణ. సీజన్ కొకసారైనా మోటారు కాలి పోతుంటది. దాన్ని రిపేరు చేసుకోవడానికి ఖర్చు. అప్పుడప్పుడు ట్రాన్స్‌ఫార్మర్లు కాలి పోతుంటాయి. దాన్ని బాగుచేసుకోటానికి అన్ని పనులు పక్కనబెట్టి కరెంటు ఆఫీసు చుట్టూ తిరగాలి. ఈ లోగా కొంత పొలం ఎండిపోతది. పై కారణాల వలన బావుల కింద సాగుచేసే రైతులకు 20-25 శాతం ఖర్చులు అధికంగా ఉంటాయి. కాలువకింద పరిస్థితి వేరు. ఇంత శ్రమ ఉండదు.

అసలు బావుల తవ్వకానికే రైతులు బోలెడు పెట్టుబడి పెట్టవలసి వస్తున్నది. ఆ పెట్టుబడికి ఫలితం దక్కక అప్పులు మీద బడి రైతులు ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. బావుల సేద్యం మన దగ్గరనే ఎక్కువున్నది. కాబట్టి ఆత్మహత్యలు తెలంగాణలోనే ఎక్కువ. ఆయా ప్రాంతాల్లో జరిగిన ఆత్మహత్యల వివరాలు దిగువ పట్టికలో చూడవచ్చు.

| | 1-7-1998 నుండి 14-5-2004 వరకు | 15-5-2004 నుండి 28-2-2005 వరకు | మొత్తం |
|---|---|---|---|
| తెలంగాణ | 1048 | 1184 | 2232 |
| రాయలసీమ | 259 | 279 | 538 |
| కోస్తాంధ్ర | 45 | 442 | 487 |
| మొత్తం | 1352 | 1905 | 3257 |

బలవన్మరణం ఎక్కడ జరిగినా అన్యాయమే. దాన్ని రూపుమాపటానికి ప్రాంతాలకు అతీతంగా ప్రయత్నించాలి. అయితే ఈ చావులు సంక్షోభానికి సంకేతమని మరువరాదు. ఒక్కొక్క ప్రాంతంలో ఈ సంక్షోభానికి ఒక్కొక్క కారణం ఉన్నది. ఆ నిర్దిష్టతను విస్మరించరాదు. సాగునీటి సౌకర్యం కల్పించక పోవడం, ఇతర మౌలిక సదుపాయాలను కల్పించకపోవడం, పునాస పంటల పరిరక్షణకు చర్యలు తీసుకోకపోవడం, నీటి



సౌకర్యంలేని చిన్న రైతులను పట్టించుకోక పోవడం తెలంగాణలో సంక్షోభానికి మూల కారణం.

ఈ సంక్షోభం ఫలితంగా పోయిన మూడు సంవత్సరాలుగా కొనసాగుతున్న వరుస కరువులతో తెలంగాణ గ్రామీణ జీవితం అతలాకుతలం అయిపోయింది. చాలా గ్రామాల్లో సాగుభూమి సగం నుండి పావు భాగానికి పడిపోయింది. సాగైన భూమిలో కూడా దిగుబడి రాలేదు. అందువలన పనులు దొరకక, తినడానికి తిండిలేక చాలామంది ఆకలిచావులకు లోనవుతున్నారు. ఈ వ్యాసం చివర మెదక్ జిల్లాలో 2004 సంవత్సరంలో జరిగిన ఆకలిచావుల వివరాలున్నాయి. చనిపోయిన వాళ్ళు పనిచేసుకోలేని ముసలివాళ్ళు కాదు. పనిచేసుకుంటూ కుటుంబాన్ని ఆదుకోగలిగిన వారే ఆకలిచావులకు లోనయ్యారు. మత్స్యపరిశ్రమ, కల్లుగీత, పశుపోషణ, చేనేత, వ్యవసాయ రంగాలు మన ప్రభుత్వ సరళీకరణ విధానాల వలన చితికిపోయింది. కనుక గ్రామాలలో ఆ వర్గాలు కూడా బతుకుదెరువు కోల్పోయాయి.

ఈ సంక్షోభం నుండి గట్టెక్కడానికి బీడీలు చుట్టుతున్నారు. వలసపోయి మట్టిపని చేసుకుని బతుకుతున్నారు. అందువలన శ్రమ ఎక్కువ. ఫలితం తక్కువ. బతుకుదెరువు అవకాశాలు కనిపించక, నిరాశ నిస్పృహలకు లోనై తాగుడుకు బానిసలై పోతున్నారు.

ఇంతటి సంక్షోభానికి ప్రభుత్వం చూపుతున్న పరిష్కారమేమిటి? ప్రభుత్వం పునాస పంటల పరిరక్షణకు మార్కెటు అభివృద్ధికి చేస్తున్నది ఏమి లేదనే చెప్పాలి. పామాయిలు అభివృద్ధికి కుప్పం ప్రాజెక్టుకు (చిత్తూరులోని కుప్పంలో ఇజ్రాయిల్ తరహా వ్యవసాయాన్ని పెపొందించడానికి ప్రభుత్వం తీసుకొచ్చిన పథకం) కలిపి 15 కోట్లు కేటాయిస్తే మొత్తం తెలంగాణ రైతుకు బతుకుదెరువు చూపగల పునాసపంటలకు ఈ మాత్రం కూడా కేటాయించలేదు. ఎక్కువగా తెలంగాణలో లాభం చేకూర్చగల మొక్కజొన్న, పప్పుధాన్యాల పరిరక్షణకు 2 కోట్లు కేటాయించారు. ఇతర పునాస పంటల ప్రస్తావనే లేదు. కొబ్బరితోటలకు వచ్చే చీడపీడల నివారణకు నాలుగున్నర కోట్లు కేటాయిస్తే తెలంగాణలో లక్షలాది మందికి బతుకుదెరువు చూపుతున్న తాటి చెట్లను పీల్చి పిప్పి చేస్తున్న మొగిపురుగు నివారణ ప్రస్తావనే బడ్జెటులో లేదు. విజయవాడ మామిడితోటలకు గాను బడ్జెటులో డబ్బు కేటాయిస్తారు. కాని నల్గొండ బత్తాయి తోటల గురించి కరీంనగర్, ఆదిలాబాద్ మామిడితోటల మాటే లేదు. పంటల పరిస్థితి అట్లుండగ సాగునీటి సమస్యల పరిష్కారానికి ఒకవేపు వాటర్‌షెడ్లు మరోవైపు బిందు, తుంపర సేద్యాలు పరిష్కారంగా ముందుకొచ్చాయి. ఈసారి బడ్జెటులో ఈ బిందు సేద్యం పథకానికి 138 కోట్లను కేటాయించారు. తెలంగాణలో రైతు ఈ పథకాన్ని ఉపయోగించలేదు.

బిందు, తుంపర సేద్యం వలన చిన్న రైతులకు లాభం లేదు. అందువలన పెట్టుబడి భారం పెరుగుతుంది. అయినా ఇది వారు పండించే పంటలకు పనికిరాదు. పండ్ల చెట్లకే ఈ సేద్యం పనికొస్తుంది. అటువంటి వ్యవసాయం చేసే ఫామ్‌హౌజ్‌లకే బిందు సేద్యం పనికొస్తుంది. కనుక ఈ కొత్త సాంకేతిక పరిజ్ఞానం నీళ్ళు లేక రైతులు బీడు పెట్టిన భూములను ఫామ్‌హౌజ్‌లుగా మార్చడానికే దోహదపడుతున్నది. ఇప్పటికే హైదరాబాదుకు ఎటూ వంద కిలోమీటర్ల దూరం ఫామ్‌హౌజులు వచ్చినాయి. ఈ ఫామ్‌హౌజులకు కావలసిన పంటలను పెంపొందించడం అందుకు కావలసిన సబ్సిడీలను ఇవ్వడం మన బడ్జెటు లక్ష్యంగా ఉన్నది. కనుక బిందు సేద్యానికి ఔషధుల పెంపకానికి, పండ్లు, పూల తోటలకు మాత్రమే సబ్సిడీలున్నాయి. రైతులు పండించే పంటల గురించి పట్టించుకునే నాధుడే లేడు. ఇదీ ఉమ్మడి రాష్ట్రంలో తెలంగాణ వ్యవసాయరంగ స్థితి. ఈ పరిస్థితి తలెత్తడానికి గత 50సంవత్సరాలుగా ప్రభుత్వాలు అనుసరించిన విధానాలే కారణమని గమనించాలి. ఈ సంక్షోభం ప్రకృతి సిద్ధమైన కారణాల వలన వచ్చింది కాదు. కోస్తాంధ్ర సంపన్న వర్గాల ప్రభుత్వం అనుసరించిన విధానాలే ఇందుకు మూలకారణం. సంక్షోభం మానవ చర్యల ఫలితం. తెలంగాణపై నెలకొన్న కోస్తాంధ్ర ఆధిపత్యం తొలగిపోకుండ ఈ సమస్యలూ తీరవు. ప్రత్యేక రాష్ట్రంగా అయితే తప్ప ఇక్కడి రైతుల సమస్యలు ఎజెండా మీదికి రావు. వాటికి ఒక పరిష్కారం దొరకది.



# మెతుకు జిల్లాలో ఆకలి చావులు

## 2004 జనవరి నుండి డిసెంబర్ 2004 వరకు

| సం. | తేది | పేరు | వయస్సు | మండలము | గ్రామము |
|---|---|---|---|---|---|
| | | | **జనవరి** | | |
| 1. | 14 | భారతమ్మ (ముదిరాజ్) | 30 | గజ్వేల్ | ప్రజ్ఞాపూర్ (లింగరాజ్‌పల్లి) |
| 2. | 17 | రాజయ్య (తండ్రి) | 60 | దౌల్తాబాద్ | తిర్మలాపూర్ |
| 3. | 17 | సత్తవ్వ (కూతురు) | 40 | దౌల్తాబాద్ | తిర్మలాపూర్ |
| | | | **ఫిబ్రవరి** | | |
| 4. | 26 | పద్మ | 35 | రామాయంపేట | రామాయంపేట |
| | | | **మార్చి** | | |
| 5. | 08 | కుమ్మరి మల్లయ్య | 42 | దౌల్తాబాద్ | దొమ్మాట |
| 6. | 15 | చాకలి చంద్రం | 35 | తొగుట | వెంకటరావుపేట |
| 7. | 26 | గోల్కొండ సుదర్శన్ రెడ్డి | 28 | రామాయంపేట | లక్ష్మాపూర్ |
| 8. | 28 | కోటేశ్వర్ | 25 | తూప్రాన్ | బ్రాహ్మణపల్లి |
| | | | **ఏప్రిల్** | | |
| 9. | 30 | అట్టల రాములు | 50 | రామాయంపేట | రామాయంపేట |
| | | | **మే** | | |
| 10. | 4 | ఎర్రగొల్ల మణెమ్మ | 28 | దుబ్బాక | చెల్లాపూర్ |
| 11. | 6 | ధర్మాద్రి శేషాద్రి | 45 | తొగుట | జప్తిలింగారెడ్డిపల్లి |
| 12. | 8 | నీరుడి లక్ష్మి (ఎస్.సి) | 32 | గజ్వేల్ | అహ్మదీపూర్ |
| 13. | 8 | వేర్పులబాల్‌నర్సయ్య | 55 | సిద్ధిపేట | రావురుకుల |
| 14. | 14 | ఊషయ్య | – | దుబ్బాక | పెద్దచీకోడ్ |
| 15. | 14 | చాకలి లక్ష్మి | 30 | తొగుట | వెంకట్రావుపేట |
| 16. | 14 | తుడుం ఎల్లమ్మ | 38 | దౌల్తాబాద్ | రాయపోల్ |
| 17. | 24 | మాట్ల శివరాజవ్వ | 48 | మిరుదొడ్డి | అందె |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 18 | 26 | జొజిమొగ్గ చంద్రం | 32 | దుబ్బాక | నగరం |
| 19. | 28 | కంది బాల్‌నర్సయ్య | 49 | మిరుదొడ్డి | కాసులాబాద్ |
| 20. | 30 | వాతని పెంటయ్య | 70 | తొగుట | కాన్గల్ |

**జూన్**

| | | | | | |
|---|---|---|---|---|---|
| 21. | 01 | బంజేరుపల్లి పోచయ్య | 70 | తొగుట | గుడికందుల |
| 22. | 01 | మల్లమల్లి లక్ష్మి | 50 | దుబ్బాక | బొప్పాపూర్ |
| 23. | 04 | యాట సత్తయ్య | 38 | చిన్నకోడూర్ | అనంతసాగర్ |
| 24. | 04 | కొముచిన్న ఎల్లయ్య | 65 | దుబ్బాక | గోసాన్‌పల్లి |
| 25. | 06 | కొవ్వూల నర్సమ్మ | 40 | అందోల్ | అందోల్ |
| 26 | 08 | సంగోళ్ళ నర్సింలు (చాకలి) | 32 | రామాయంపేట | చల్మెడ |
| 27. | 10 | దండు పోచయ్య | 50 | సిద్దిపేట | నారాయణరావుపేట |
| 28. | 13 | గుండుకాడి మల్లయ్య | 53 | సిద్దిపేట | నారాయణరావుపేట |
| 29. | 15 | ఎల్లయ్య | 50 | దౌల్తాబాద్ | తేరిపల్లి బందారం |
| 30. | 17 | ఎం. తిరుపతి (మంగలి) | 40 | తొగుట | జప్తిలింగారెడ్డిపల్లి |
| 31. | 19 | ఏదుల దుర్గయ్య | 60 | వెల్దుర్తి | ఆరిగూడెం |
| 32. | 19 | సిద్దిని గాలయ్య (తండ్రి కొడుకులు) | 55 | దుబ్బాక | చిట్టాపూర్ |
| 33. | 19 | సిద్దిని దేవదాసు | 23 | దుబ్బాక | చిట్టాపూర్ |
| 34. | 19 | గద్దం నారాగౌడ్ | 50 | సిద్దిపేట | నారాయణరావుపేట |
| 35. | 20 | బాల్‌శెట్టి రాముగౌడ్ | 60 | మిరుదొడ్డి | భూంపల్లి |
| 36. | 20 | బురుజొన్న ఎల్లయ్య | 50 | ధర్మాజీపేట | దుబ్బాక |
| 37. | 28 | కోడి నర్సయ్య | 40 | చిన్నకోడూర్ | జక్కాపూర్ |
| 38. | 29 | పుర్ర రాజయ్య | 45 | సిద్దిపేట | నారాయణరావుపేట |
| 39. | 29 | గొల్ల గట్టయ్య | 65 | దుబ్బాక | చెల్లాపూర్ |
| 40. | 30 | గుండెల్లి మల్లయ్య | 60 | తొగుట | వెంకట్రావుపేట |

**జూలై**

| | | | | | |
|---|---|---|---|---|---|
| 41. | 1 | సాదక్ అలి | 55 | సిద్దిపేట | బంజేరుపల్లి |
| 42 | 2 | చాకలి సత్తయ్య | 60 | మిరుదొడ్డి | భూంపల్లి |



| | | | | | |
|---|---|---|---|---|---|
| 43. | 4 | బైరి లింగమయ్య | 65 | పుల్కల్ | బద్రిగూడెం |
| 44. | 9 | రాముగొల్ల జయమ్మ | 35 | కోడిపల్లి | చిట్కుల్ |
| 45. | 13 | నక్క మల్లయ్య | 65 | నంగునూర్ | వెంకటాపూర్ |
| 46. | 16 | జనగామ కమలమ్మ | 50 | దుబ్బాక | ధర్మాజీపేట |
| 47. | 21 | పుట్టల రాములు | 35 | పాపన్నపేట | గాజులగూడెం |
| 48. | 26 | తడుం వెంకటి | 30 | టెక్మాల్ | టెక్మాల్ |
| 49. | 26 | బండి యాదయ్య | | నంగునూర్ | బద్దిపడగ |
| 50. | 30 | దుర్గారెడ్డి | 45 | కొల్చారాం | పైతర |
| 51. | 30 | వెంపల్లి పెంటయ్య | 60 | దౌల్తాబాద్ | ఇంద్రుప్రియాల్ |

**ఆగస్టు**

| | | | | | |
|---|---|---|---|---|---|
| 52. | 06 | జూపల్లి భాగయ్య | 30 | తొగుట | వెంకట్రావుపేట |
| 53. | 08 | చూగూరి పోచయ్య | 45 | సిద్దిపేట | నారాయణరావుపేట |
| 54. | 9 | పెద్దీరు బాలివ్వ (రెడ్డి) | 70 | చిన్నకోడూర్ | చిన్నకోడూర్ |
| 55. | 9 | మహ్మద్ ఇమామ్ | 50 | దుబ్బాక | దుబ్బాక |
| 56. | 15 | మందాపురం భూదయ్య (తండ్రి, కూతురు) | 44 | చేగుంట | పులిమామిడి |
| 57. | 15 | ఎల్లవ్వ | 20 | చేగుంట | పులిమామిడి |
| 58. | 15 | వెల్పుల ఎల్లయ్య | | సిద్దిపేట | నారాయణరావుపేట |
| 59. | 15 | బూసిరెడ్డి రాజిరెడ్డి | 32 | చిన్నకోడూర్ | చెర్లఅంకిరెడ్డి పల్లి |
| 60. | 18 | శేరిపల్లి ఎల్లయ్య | 30 | దౌల్తాబాద్ | ముబారస్‌పూర్ |
| 61. | 19 | పుర్ర కమలవ్వ | 60 | దౌల్తాబాద్ | రాయపోల్ |
| 62. | 19 | పోచయ్య | 35 | దుబ్బాక | ధర్మాజిపేట |
| 63. | 19 | పందుగ ఎల్లవ్వ | 28 | చిన్నకోడూర్ | అల్లీపూర్ |
| 64. | 22 | చుక్కా రేణుక | 25 | మిరుదొడ్డి | అందె |
| 65. | 30 | బైండ్ల లక్ష్మి | 30 | సిద్దిపేట | నారాయణరావుపేట |

**సెప్టెంబర్**

| | | | | | |
|---|---|---|---|---|---|
| 66. | 03 | గోనె శ్రీనివాస్ | 35 | కొండాపూర్ | కొండాపూర్ |
| 67. | 05 | కుమ్మరిరామయ్య | 50 | మిరుదొడ్డి | మిరుదొడ్డి |
| 68. | 05 | ఏటి రాజయ్య | 50 | నంగునూర్ | పాలమాకుల |
| 69. | 05 | కొమటి లింగం | 53 | మిరుదొడ్డి | చెప్యాల |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 70. | 05 | పూస రమేష్ | 40 | మిరుదొడ్డి | మిరుదొడ్డి |
| 71. | 08 | అల్‌గోల బాలయ్య | 50 | మెదక్ | తొగిట |
| 72. | 09 | లింగాల నర్సవ్వ | 42 | తొగుట | తుక్కపూర్ |
| 73. | 09 | కొత్తపల్లి కనకయ్య (కుమ్మరి) | – | సిద్ధిపేట | ఎన్సాన్‌పల్లి |
| 74. | 09 | దాసరి లక్ష్మవ్వ | 50 | తుప్రాన్ | వెంకటరత్నపూర్ |
| 75. | 10 | కామిడ్రి చంద్రయ్య | 55 | గజ్వేల్ | అహ్మదీపూర్ |
| 76. | 10 | లక్ష్మి నర్సవ్వ (మంగలి) | 37 | దుబ్బాక | రామక్కపేట |
| 77. | 10 | లంబాడి హర్యా | 30 | రాంచంద్రపూర్ | వెలిచెల |
| 78. | 11 | దండు భారతి | 25 | రామాయంపేట | దామరచెర్వు |
| 79. | 11 | పోచంగల్ల బాలయ్య | 45 | చిన్నశంకరంపేట | సురారం |
| 80. | 12 | గజ్జెల లక్ష్మి | 32 | చిన్నకోడూరు | గోనెపల్లి |
| 81. | 12 | గుండాల బాల్ నర్సయ్య(పద్మశాలి) | 48 | చిన్న కోడూర్ | కస్తూరిపల్లి |
| 82. | 12 | ఆది బాల్‌నర్సయ్య | 38 | నంగునూర్ | రాజగోపాల్‌పేట |
| 83. | 12 | రాపల మల్లవ్వ | 45 | కొండపాక | అంకిరెడ్డిపల్లి |
| 84. | 12 | బేగిరి బాలయ్య (ఎస్‌సి) | 50 | కల్హేర్ | మాసానపల్లి |
| 85. | 13 | పసునూరి బాలయ్య | 45 | దుబ్బాక | లచ్చపేట |
| 86. | 13 | గుమ్మడిదల రాజవ్వ | 60 | మిరుదొడ్డి | చేర్వాపూర్ |
| 87. | 16 | చిన్నగల్ల రాజయ్య | 60 | మిరుదొడ్డి | మిరుదొడ్డి |
| 88. | 16 | తిప్పారం మోనయ్య | 50 | మిరుదొడ్డి | ఆరేపల్లి |
| 89. | 16 | పెద్ద కటిక (ఇసూబీబి) | 26 | కొల్చారం | రంగంపేట |
| 90. | 08 | యాదయ్య | – | తొగుట | బంజేరుపల్లి |
| 91. | 3 | పెద్ద రాజయ్య | – | తొగుట | బంజేరుపల్లి |
| 92. | – | దొంతి నర్సింలు | – | తొగుట | తుక్కాపూర్ |
| 93. | 20 | పోకల పోశల | 45 | కొండపాక | అంకిరెడ్డిపల్లి |
| 94. | 20 | దప్పు ఎల్లవ్వ | 55 | చేగుంట | ఉప్పరిపల్లి |
| 95. | 20 | నల్లాల నర్సయ్య | 60 | చిన్నకోడూర్ | రామునిపట్ల |
| 96. | 20 | జంగిట రాములు (మాదిగ) | 35 | కొండపాక | వేలికట్ట |



| | | | | | |
|---|---|---|---|---|---|
| 97. | 21 | సాయయైన నర్సమ్మ | 55 | దుబ్బాక | చికోడు |
| 98. | 21 | దొంతి బాలయ్య | 58 | చిన్నకోడూర్ | విఠాలాపూర్ |
| 99. | 21 | కుమ్మరి రాజయ్య | 65 | తొగుట | ఎల్లారెడ్డిపేట |
| 100. | 21 | జెరిపోతుల శివయ్య | 60 | చిన్నకోడూర్ | మచ్చాపూర్ |
| 101. | 23 | రాజంగారి కిష్టమ్మ | 48 | కొల్చారం | కొల్చారం |
| 102. | 23 | వద్దచర్ల నర్సవ్వ | 65 | తొగుట | ఎల్లారెడ్డిపేట |
| 103. | 23 | లంబాడి రేక్య | 55 | కొల్చారం | వరిగుంతం |
| 104. | 24 | కొరక రాజయ్య | 40 | చిన్నకోడూర్ | గోనేపల్లి |
| 105. | 25 | బ్యాగరి నర్సయ్య | 45 | తొగుట | ఏటిగడ్డ కిష్టాపూర్ |
| 106. | 27 | పాశం జయరాం రెడ్డి | 45 | గజ్వేల్ | బంగ్లావెంకటాపూర్ |
| 107. | 28 | కాన్గంటి ఎల్లయ్య | 48 | మిరుదొడ్డి | మిరుదొడ్డి |
| | | **అక్టోబర్** | | | |
| 108. | 02 | బోయిని నాగయ్య | 50 | చిన్నకోడూర్ | చంద్లాపూర్ |
| 109. | 02 | కొలసిద్ద గౌడ్ | 50 | తొగుట | పెద్దమాసాన్‌పల్లి |
| 110. | 02 | తొర్రి మల్లయ్య | 45 | తొగుట | జప్తిలింగారెడ్డిపల్లి |
| 111. | 12 | గాజుల ఇమ్మోనుయేలు | 40 | సిద్దిపేట | మాచాపూర్ |
| 112. | 14 | బొత్త మల్లయ్య | 45 | చిన్నకోడూర్ | సికింద్లాపూర్ |
| 113. | 28 | పుట్ర లక్ష్మయ్య | 50 | కొల్చారం | సంగాయిపేట |
| 114. | 28 | సైదుగారి మల్లవ్వ | 60 | తొగుట | ఎటిగడ్డ కిష్టాపూర్ |
| 115. | 30 | చెక్క పర్సయ్య | 55 | కొండపాక | కొండపాక |
| 116. | 31 | చెక్క పద్మయ్య | 55 | కొండపాక | కొండపాక |
| 117. | 31 | దూదేకుల మౌలానా | 60 | దుబ్బాక | ఎనగుర్తి |
| | | **నవంబర్** | | | |
| 118. | 01 | ఎండుపల్లి లింగం | 27 | రామాయంపేట | నందిగామ |
| 119. | 01 | కమ్మరి సురేష్ | 25 | తొగుట | ఎల్లారెడ్డిపేట |
| 120. | 07 | ఎల్క దానయ్య | 25 | కొల్చారం | తుక్కాపూర్ |
| 121. | 07 | గొల్ల నర్సయ్య | 25 | సిద్దిపేట | కాళ్లకుంట కాలనీ |
| 122. | 10 | ఎర్రోల్ల మానయ్య | 40 | కొండాపూర్ | గొల్లపల్లి |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 123. | 11 | దర్జి యాదగిరి | 35 | కొల్చారం | ఎసగండ్ల |
| 124. | 13 | కుర్మ ఐలయ్య | 30 | తొగుట | తుక్కపూర్ |
| 125. | 13 | రాజంగారి దుర్గయ్య | 60 | కొల్చారం | కొల్చారం |
| 126. | 15 | నాయిని రాములు | 60 | దుబ్బాక | ఆకారం |
| 127. | 17 | గడ్డం దుర్గయ్య | 55 | మెదక్ | తొగిట |
| 128. | 19 | గోదాల భాగమ్మ | 60 | చేగుంట | నార్సింగి |
| 129. | 22 | ఖాజా అజీజ్ | 45 | దుబ్బాక | లచ్చపేట |
| 130. | 23 | జంగం బసవయ్య | 55 | కొండపాక | సిరిసినగండ్ల |
| 131. | 23 | మంగళపల్లి పోషకళ | 35 | తొగుట | తొగుట |
| 132. | 24 | ఉండాడి బాలయ్య | 70 | మిరుదొడ్డి | చెప్యాల |
| 133. | 25 | కోదండ చంద్రయ్య | 45 | తొగుట | జప్తిలింగారెడ్డిపల్లి |
| 134. | 30 | వడ్డె వెంకటవ్వ | 26 | నంగునూరు | పాలమూరు |
| | | **డిసెంబర్** | | | |
| 135. | 01 | బొమ్మ సత్తయ్య | 28 | వర్గల్ | పాములపర్తి |
| 136. | 04 | చింతల ఎల్లవ్వ | 35 | దుబ్బాక | గంబీర్‌పూర్ |
| 137. | 06 | బక్కా గౌడ్ | 55 | మిరుదొడ్డి | మల్లుపల్లి |
| 138. | 08 | నామాల బాలయ్య | 45 | కొల్చారం | కిష్టాపూర్ |
| 139. | 08 | నర్సింలు | 55 | కొల్చారం | కిష్టాపూర్ |
| 140. | 13 | గగ్లోల్ వాసురాం | 35 | రామాయంపేట | బుచ్చిరాజ్‌పల్లి |
| 141. | 21 | మన్నె రాములు (తండ్రి) | 40 | పటాన్‌చెరువు | ఐలాపూర్ |
| 142. | 21 | స్వప్న (కూతురు) | 14 | పటాన్‌చెరువు | ఐలాపూర్ |
| 143. | 21 | స్వాతి | 12 | పటాన్‌చెరువు | ఐలాపూర్ |



# తెలంగాణ భాషా సంస్కృతులు - వివక్ష

- నందిని సిధ్ధారెడ్డి

సుమారు 49 సంవత్సరాల సమైక్య జీవనం తర్వాత తెలంగాణ భాష సంస్కృతులు అస్తిత్వం కోసం, ఉనికి కోసం పోరాడుతున్నాయి. ప్రాంతాలు వేరైనా భాష ఒక్కటనే సాకు మీద ఆంధ్రా తెలంగాణా ప్రాంతాల్ని కలిపి ఒక రాష్ట్రంగా ఏర్పాటుచేసినప్పటికీ పొరపొచ్చాలు పోలేదు. పైగా బాగా పెరిగిపోయాయి. ఆనాడు భిన్న చారిత్రక నేపథ్యాలు, నాగరిక స్థితులు కలిగిన రెండు ప్రాంతాలు కలిపేటందుకు ఒక భాషగా చెప్పబడిన ఏ తెలుగు భాషయితే ప్రధాన సూత్రమైందో ఆ బాషే ఇయ్యాల్ల వేర్పాటుకు ముఖ్య సమస్యగా ముందుకొస్తున్నది.

రెండు ప్రాంతాల వ్యవస్థలు రెండు విభిన్న చారిత్రక నేపథ్యాల మంచి రూపొందినయి. రెండు ప్రాంతాల ప్రజలు భిన్న రాజకీయార్థిక జీవనం వల్ల భిన్న సాంస్కృతిక దశల్ని కలిగి ఉన్నరనేది గుర్తుంచుకోవాలె. వాళ్ళ అనుభవాలు గూడ వేర్వేరుగా ఉన్నాయని గుర్తుంచుకోవాలి. వాళ్ళ అనుభవాలు గూడ వేర్వేరుగ ఉన్నాయని గుర్తుంచుకోవాలె. ఇసొంటి దశల్లో 'కలవబడిన' ప్రజా సమూహాలు ఎంతకాలం కలిపి ఉంచినప్పటికీ అది ప్రజాస్వామిక కలయిక కాలేదని వారి మధ్య సమాన అభివృద్ధి సాధ్యం కాదని నాలుగు దశాబ్దాల ఐక్యత సృష్టించిన వివక్షలే, విభేదాలే నిదర్శనం.

ఒక జాతి ప్రజల జీవన స్థితిని అర్థం చేసుకోవటానికి భాష ఏ స్థితిలో ఉందో పరిశీలించటం ద్వారా తెలిసిపోతది. అందుకే చైతన్యాన్ని అణచే పాలకులెప్పుడూ ప్రజల భాషను అణచి ఉంచేందుకు ప్రయత్నిస్తరు. ఉత్పత్తిలో భాగంగా ప్రజలు

భాషలు సృష్టిస్తరు. ఆ భాషలను పాలకులు తమకనుగుణంగా అటు ఇటూ సంస్కరించి తమ భాషగా తయారుచేసి చెలామణి చేసి ఆధిపత్యాన్ని చెలాయిస్తరు. సంపదలు దోచుకునేటందుకు ప్రజల మీద పెత్తనం చేసేటుందుకు భాష చాలా ఉపకరిస్తుంది. గుగీ చెప్పినట్లు భాష అన్నింటికన్న మహత్తరమైన సాధనం. దీని ద్వారా ఆత్మను వశం చేసుకోవచ్చు. అణచివేత ద్వారా గాని, అంగీకారం తయారు చేసుకోవటం ద్వారా గాని, ఒకసారి ప్రజల మెదళ్ళ మీద ఆధిపత్యం సాధించారంటే ఇగ సంపదలన్ని కొల్లగొట్టకపోవచ్చు. అట్లా ప్రజల మీద ఆధిపత్యం సాధించేటందుకు తేలికయినదీ మొదటిదీ భాషాధిపత్యం. పాలకులు, సంపన్నులు ఏ ప్రజా సమూహం మీద పెత్తనం చెయ్యదల్చుకున్నారో ఆ ప్రజా సమూహం భాషను చిన్నచూపు చూస్తరు. తక్కువ భాషగా ప్రచారం చేస్తరు. తమ ఆధిపత్యం కోసం, అధికారం కోసం తక్కువ భాషలు, ఎక్కువ భాషలు అనే వ్యత్యాసాలు లేవదీస్తరు.

భాషల చరిత్రలో బానిస సమాజం నుంచి ఆధిపత్య భాషలు. బానిస భాషల దృష్టి కొనసాగుతున్నది. శతాబ్దాల కింద పాలకవర్గాలు పోషించి సంస్కృత భాషాధిపత్యం కోసం తెలుగు భాష అట్లా అవస్థపడింది. రాజ్య విస్తరణ, సామ్రాజ్యాల స్థాపనలో భాగంగా భారతదేశంలో సంస్కృతం విస్తరించి ప్రాంతాల భాషల్ని అణచివేసింది. ప్రాంత భాషల్లో బలం లేదని సృష్టించిన అపవాదుల్లో తెలుగుభాష కూడా నలిగిపోయింది. తెలుగు పదాలలో సత్తా లేదని. సరిపోయే శబ్దజాలం లేదని అవమానించిండ్రు. బ్రిటీష్ పాలకుల కాలంలో ఆంగ్లాధిపత్యం కింది తెలుగు న్యూనతకు లోనయింది. ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ఆంధ్రబాష తమిళ భాషారాదన ముందు అవమాన పొందింది. అంత అనుభవించిన ఆంధ్రభాష ఇప్పుడు తన ఆధిపత్యంతో తెలంగాణ భాషనట్లాగే అవమానిస్తున్నది. అభ్యుదయ రచయితలు మొదటిసారిగా రచనల్లో ప్రజల భాషను ఉపయోగించినపుడు ఇసొంటి అపవాదే వచ్చింది. అభ్యుదయ రచయితలు మోటు భాష వాడతారని సున్నితమైన, మధురమైన భాషకు వ్యతిరేకులని పాలకవర్గీయులు ఆక్షేపించిండ్రు. సరిగ్గా ఇపుడు తెలంగాణా భాష ఈ అవమానాల్ని పొందుతున్నది. తెలంగాణ భాషలో జిగి లేదని, శబ్దజాలం లేదని, మోటుగా ఉంటదని, సున్నితత్వం ఉండదని, మర్యాదకరంగా నాజూగ్గా ఉండదని ఈసడింపులను, అవహేళనలను ఎదుర్కొంటున్నది. సినిమాలల్ల, టీ.వి. సీరియల్స్‌ల రౌడీలకు, విలన్లకు, హాస్య పాత్రలకు తెలంగాణ రాయలసీమ భాషల్ని పెట్టి దారుణంగా అవహేళన చేస్తున్నారు. వెనుకబడిన ప్రజల భాషలు ఎదుర్కొనే అనేక సమస్యలకు అభివృద్ధి చెందిన భాషల ఆధిపత్యభావనే మూలమైనది.

తెలంగాణ భాషలో ఉర్దూ పదాలు ఎక్కువగా ఉంటాయని మరో ఆరోపణ. భాషా వికాసాన్ని శాస్త్రీయ దృష్టితోని పరిశీలించినపుడు ఏ భాష మడిగట్టుకొని శుద్ధంగా ఉండదని అర్థం చేసుకోవటం కష్టమేమీ కాదు. ఒక భాష ఎదుగుతున్న



క్రమంలో ఎన్నో ఇతర భాషా సమూహాల పదాలు కలుపుకుంటూ సాగిపోతది. తెలుగులో ఎప్పుడూ పాలనా భాషా పదాలు 50శాతం పైగా ఉంటూ వచ్చాయని పరిశోధకులు చెబుతున్నారు. సంస్కృత, ప్రాకృతాల కాలంలో, అరబ్బీ, పారసీల, ప్రాబల్యంలో, ఇంగ్లీషు, పోర్చుగీసు కాలంలో ఎన్నో అన్యదేశ్యాలు అన్ని ప్రాంతీయ భాషల్లో చోటు చేసుకున్నాయి. తెలుగులో కూడా అట్లానే తెలంగాణ ప్రాంతంలో ఉర్దూ పాలనాభాషగా ఉండడం వల్ల ఆ భాషా పదాలు తెలంగాణలో చాలా భాగం వచ్చి చేరినయి. ఇయ్యాల్ల ఆంధ్ర తెలుగులో ఉన్న అన్యదేశ్యాల గురించి కూడా పరిశీలించాలెమరి. తెలంగాణ వాళ్ళు తెలుగు మాట్లాడితే ఆంధ్ర ప్రాంతం వాళ్ళకు నవ్వొస్తది. తక్కువకు ఇక్కడి తెలుగును అనుకరించి మరీ నవ్విస్తరు. ఇద్దరిదీ తెలుగు అంటరు. తెలంగాణ తెలుగులో ఉన్న ఉర్దూ పదాలు హేళనకు గుర్తులుగా భావించటం వెనుక దృష్టి ఉన్నది. తెలంగాణా భాషకు 'తౌరక్యాంధ్ర' అని పేరు పెట్టిన పండితులు కూడా కోస్తాంధ్ర భాషకు 'ఇంగ్లీషాంధ్ర' అని పేరు పెట్టకపోయిండ్రు.

తెలుగులలో గ్రాంధిక భాష మీద వ్యవహార భాష సాధించిన విజయం చాలా ప్రగతిశీలమైనదే. అయితే తెలంగాణ భాషను అణచివేయటంలో ఆంధ్రప్రాంత వ్యవహార భాష పాత్ర కూడా గుర్తించాలి. వ్యవహారిక భాషావాదులు ప్రగతిశీలురైన ఆంధ్ర భాషా పండితులు తెలంగాణ వ్యవహార భాష విషయంలో ఎందుకు అడ్డంకులు పెడుతున్నారో జాగ్రత్తగా ఆలోచించాలె. గత ముప్పయేండ్లుగా తెలంగాణ, ఆంధ్ర ప్రాంతాల భాష సమస్య వచ్చినప్పుడల్లా తెలివైన వాళ్ళు, భాషా వేత్తలు, ప్రామాణిక భాషను ముందుకు తీసుకొస్తండ్రు. 'ప్రామాణికభాష' వాదంలో అంతర్గతంగా న్యూనప్రమాణ భాష, న్యూనభాష దృష్టి కూడా ఇమిడిఉన్నది. ఏది ప్రామాణిక భాష? ప్రమాణాలు ఎవరు నిర్ణయిస్తరు? చర్చ కొంతవరకు సాగింది. అప్పుడు పండితులు ముఖ్యంగా ఆంధ్రా పండితులు పత్రికాభాష, రచనభాషనే ప్రామాణిక భాషగా భావించాలనే తీర్మానించిండ్రు. ఇది అందరికీ సమ్మతంగా అనిపించినప్పటికీ, ఆమోదించినప్పటికీ ఈ వాదం వెనుక ఉన్న 'కుట్ర' చాలాకాలం వరకు గానీ బోధపడలేదు. పత్రికా భాషంటే ఇప్పుడున్న తెలుగుపత్రికల్లో ఉపయోగించే భాష. ఈ పత్రికలు ఎవరివి? ఏ భాషను అవి ఉపయోగిస్తున్నయి? ఉన్న అన్ని పత్రికలకు పెట్టుబడులు పెట్టిన యజమానులు ఆంధ్రాప్రాంతం వారు. ప్రసార సాధనాలు, ప్రసారణ సంస్థలు ఆంధ్రప్రాంతీయులవి. అందులో ముఖ్యస్థానాల్లో ఉండి భాషా నిర్మాణాలు, రచనా పద్ధతులు నిర్ణయించేవాళ్ళు ఆంధ్ర ప్రాంతీయులు. వాళ్ళు నిర్ధారించి ప్రచారం చేసిన రూపాల్ని ప్రమాణంగా భావించటం వల్ల కోసాంధ్ర బూర్జువా వర్గాల భాష, సంపన్న పాలక వర్గాల భాష "ప్రమాణభాష" అయి కూచున్నది. వ్యవహార భాషా వాదంలో ప్రజల వాడుక భాషను ముందుకు తెచ్చి గ్రాంధిక భాష మీద విజయం సాధించినవారు తెలంగాణ ప్రజల వాడుక భాష గురించి చర్చ వచ్చే సరికి ప్రామాణిక భాషా కొలమానంతో

వెనుకకు వెళ్ళి పత్రిక, గ్రంథ భాషను ముందుకు తెచ్చి విజయం సాధిస్తున్నరు. ఆధిపత్యం కోసం అప్పుడు శాస్త్రీయ దృష్టిని అవలంబించి ఇప్పుడు ఆధిపత్యం కోసమే శాస్త్రీయ దృష్టికి పక్కకు పెడుతున్నరు. ఇప్పటి ప్రామాణిక భాషావాదం కౌగిల్లో తెలంగాణ భాష ఉక్కిరిబిక్కిరయి పోతుంది.

రెండు ప్రాంతాల భాష సంస్కృతుల వికాసంలో ఉన్న వ్యత్యాసాలకు మూలహేతువులు ఈ ప్రాంతాల వేరు వేరు రాజకీయార్థిక, సాంఘిక సాంస్కృతిక పరిస్థితులేనని గమనించాలి. 1952కు ముందు ఆంధ్రప్రాంతం మద్రాసు రాష్ట్రంలో భాగంగా బ్రిటీష్ పాలన కింద ఉన్నది. బ్రిటీష్ పాలకులు పెట్టుబడిదారీ వ్యాపార స్వభావం తెలిసిన వాళ్ళవటం చేత అభివృద్ధి చేస్తూ దోచుకోవాలనుకున్నరు. ఆంధ్రప్రాంతంలో రైలు మార్గాలు నిర్మించి, నీటి ప్రాజెక్టులు కట్టి వ్యవసాయ వ్యాపారాల్ని అభివృద్ధి చేసింద్రు. ఆంధ్రుల మనసులు చూరగొని అభిమానం సంపాదించి పనులు చేయించుకునేటందుకు ఆంధ్రభాషను ప్రోత్సహించింద్రు. పరిశోధన పుస్తకరచన, ప్రచురణలను సంఘ సంస్కరణలను, విద్య, పత్రికల రచనలను, మత ప్రచారాన్ని బాగా ప్రోత్సహించింద్రు. ఈ అవకాశాల ప్రేరణతో విద్యావంతుల రచయితల, ప్రచురణ కర్తల, పత్రికా నిర్వాహకులు సంఖ్య బాగా పెరిగింది. వ్యవసాయం, వ్యాపారం, విద్య, రాజకీయం, సాహిత్యం గణనీయంగా అభివృద్ధి చెందినయి కానీ, తెంగాణ పరిస్తితి పూర్తి భిన్నంగా ఉండింది. నిజాంది ఫ్యూడల్ స్వభావం కనుక అణచివేత ద్వారా దోచుకోవాలనుకున్నడు. హైద్రాబాద్ సంస్థానంగా ఉన్న తెలంగాణ నిజాం ఫ్యూడల్ నియంతృత్వం కింద కనీస వెసులుబాటుకు కూడా నోచుకోలేదు. ఈ ప్రాంతంలో అధిక సంఖ్యాకులు తెలుగు మాతృభాషగా కలిగి ఉన్నప్పటికీ అన్ని దశల్లో తెలుగు దారుణంగా అణచివేయబడింది. పాలనాభాషగా కోర్టు భాషగా బోధనాభాషగా ఉర్దూ రాజ్యం చేసింది. ఇక్కడి ప్రజా సమూహాల ఇతర మాతృభాషలన్నీ నిర్బంధంలో నలిగిపోయినయి. తెలుగులో విద్యాబోధన జరపటానికి పాఠశాలలు లేవు. తెలుగు ప్రైవేటుబడులు ప్రారంభించాలన్నా నిజాం పాలకుల అనుమతి పొందాల్సి ఉండేది. దేవులపల్లి రామానుజరావు అభిప్రాయం ప్రకారం నూరింట ఆరుగురు మాత్రమే అక్షరాస్యులుగా ఉన్నరు. భయంకరమైన వెట్టిచాకిరీ అమల్లో ఉండేది. నిజాం తొత్తులైన జమిందార్లు, జాగీర్దార్లు గ్రామాల్లో ఇష్టారాజ్యం చేసేవారు. 'బాంచెన్ కాల్మొక్త' అనేదాంక కష్టజీవులకు కాలం గడువలేదు. పంటల్లో ఎక్కువభాగం పన్నుల కిందకే పొయ్యే. మాన ప్రాణాలకు కొంచెమన్నా రక్షణ లేదు. కొద్ది చైతన్యాన్ని కూడా ఎదగనిచ్చేటోళ్ళ గాదు. చిన్న సభ పెట్టుకోటానికి గూడా అనుమతి తీసుకోవాలి. పత్రికలు, గ్రంథ ప్రచురణకు ఎంత మాత్రమూ వీల్లేకపోయింది. సామాజిక, ఆర్థిక, దోపిడీ విపరీతంగా కొనసాగింది. ఈ దశల్లో అభివృద్ధికీ సాంస్కృతిక వికాసానికీ ఎంత మాత్రమూ వీల్లేకుండా ఉన్న తెలంగాణ వారికీ ఆర్థికంగా మిగులు, సాంస్కృతికంగా మెలుకువ పొందిన



ఆంధ్ర ప్రాంతీయులకు మధ్య సంబంధాలు పెరిగినయి. మద్రాసు రాష్ట్రంలో చిన్నచూపుకు గురై అవమానపడిన ఆంధ్రులు ఆంధ్రభాష ఉద్యమాలు ప్రారంభించారు. తెలంగాణ ప్రజల్లో ఆంధ్ర భాషాభిమానం సోదరభావం పెంపొందించేటందుకు కృషి చేస్తూనే నాయకత్వం వహించింద్రు. అప్పటికే నిజాం పాలనలో తండ్లాడుతున్న తెలంగాణ ప్రజలు విముక్తి కోసం ఆంధ్రా ప్రగతిశీలుర నేతృత్వంలో తీవ్రమైన పోరాటాలు చేసింద్రు. భూమికోసం భుక్తికోసం జరిగిన పోరాటంలలో మునిగిపోయి భాషా సంస్కృతులను పట్టించుకోలేదు. ఉద్దేశ్యపూర్వకంగా అయినా కాకపోయినా అక్కడ నుంచి తెలంగాణ ప్రజల భాష మీద ఆంధ్రభాష పైచేయి అయింది. తర్వాత జరిగిన విశాలాంధ్ర ఉద్యమం, ఆంధ్రప్రదేశ్ అవతరణలతో తెలంగాణ భాష సంస్కృతుల మీద ఇనుపపాదం పడింది. ప్రజాస్వామిక వాదుల మీద బూర్జువా వర్గం విజయం సాధించి అధికారంలోకి రావడంతోని తెలంగాణ వనరులు, సంపదలు అటువైపు మరలించబడినయి.

ఒక దశలో అధికుని చేతిలో అవమానాలు పడి న్యూనత నెదుర్కొన్న వ్యక్తి మరో దశలో అవకాశం చిక్కితే ఇంకొక తక్కువత ముందు తన అధిక్యతను ప్రదర్శించి తృప్తిపడతడు. తమిళ ప్రజల చేతిలో సాంస్కృతిక అవమానాలు పొందిన కోస్తాంధ్ర బూర్జువా వర్గం తెలంగాణ భాష, సంస్కృతుల్ని అవమానిస్తూ ఆధిపత్యం నిరూపించుకో గలిగింద్రు. ఆంధ్రాపాలనలో తెలంగాణ ప్రజల పరిస్థితి పెనం మించి పొయ్యిల పడ్డట్టయింది. భూమి, నీరు, కరెంటు మొదలైన ముఖ్య వనరులు కోల్పోవటంతో పాటు భాష, సంస్కృతుల పరంగా అడుగడుగునా అవమానాలు పొంది తల్లడిల్లుతున్నరు. విశాలాంధ్రలో ప్రజారాజ్యం ఆనాటి నినాదమైతే విశాలాంధ్రలో విశాల భావన లోపించి ప్రజా రాజ్యంలో ప్రజా దృష్టి లోపించి ఉత్త రాజ్యం మిగిలింది.

భాష ద్వారా మానసిక బానిసత్వం సాధించవచ్చునంటడు గుగీ. ఆంధ్రభాష చేసిందదే. తెలంగాణ ప్రజల మనుసుల్ని బానిసలుగా చేసుకోగలిగింది. నిజాం రాజు జమీందార్ల పాలనలో అణచివేతలో తెలంగాణా బతుకులు తల్లడమల్లడమయితే, ఆంధ్రాబూర్జువా సర్కారు సమ్మతి తయారుచేసుకొని దోపిడీ, బానిసత్వాల్ని ఇక్కడి ప్రజల మీద రుద్దుతున్నది. మిగులు ఆదాయంతో పెట్టుబడులు పెట్టి ప్రసార సాధనాల మీద, ఉత్పత్తి సాధనాల మీద, మార్కెట్ వ్యవస్థ మీద, పట్టు సంపాయించిన ఆంధ్ర పాలకులు రాజకీయాధికారాన్ని స్థిరపర్చుకొని తెలంగాణ సాంస్కృతిక ప్రత్యేకతల మీద దాడికి పూనుకుంటున్నరు. తెలంగాణ భాషకు సాహిత్య గౌరవాన్ని ఇవ్వకుండా కుంటివాదాలు లేపుతుంద్రు.

ప్రతి ప్రాంతానికి కొన్ని జనసమూహాలుంటాయి. ఆ జనసమూహాల జీవన విధానమే ఆ ప్రాంత ప్రజల సంస్కృతిగా భావిస్తం. జీవితం పట్ల మానవుడికుండే ఇచ్ఛలో సంస్కృతి వ్యక్తమయితుంది (గోర్కి). వ్యష్టి, సమిష్టి జీవన రూపాలన్నింటిలో

కన్పించే ప్రాపంచిక అవగాహన సంస్కృతి అని చెప్పొచ్చు (గ్రాంసీ). తెలంగాణ ప్రాంతానికి భౌగోళికంగా చారిత్రకంగా ఉన్న ప్రత్యేకతలు ఇక్కడి జీవన విధానం రూపొందేటందుకు ముఖ్యపాత్ర వహించినయి.

భౌతికంగా ఎన్నో ప్రజోపయోగ వనరులన్నప్పటికీ రాజకీయ కారణాల వల్ల ఈ ప్రాంతం వెనుకబడి ఆర్థిక జీవనం మీద ప్రతిఫలించింది. తెలుగు, కన్నడ, ఉర్దూ మరాఠీ సంస్కృతులు పరస్పరం ప్రభావితమై తెలంగాణ సంస్కృతికి ప్రత్యేకతలు అద్దింది. ఇన్నేండ్ల నుంచి పరస్పర గౌరవాలు కాపాడుకున్న సాంస్కృతిక ప్రత్యేకత ఇప్పటి ఆంధ్ర సంపన్న సంస్కృతిలో కొట్టుకుపోతున్నది. ఉర్దూపదాలు కలిసిపోయి తెలంగాణ "తౌరక్యాంధ్ర"గా పిలువబడినా తెలుగుపదాలు కలుపుకొని ఉర్దూ "దక్కనీ ఉర్దూ"గా గుర్తింపు పొందింది. తెలంగాణ జీవనంలో కన్నడిగులు, కన్నడిగుల జీవనంలో తెలంగాణీయులు కలసి సహజీవనం చేస్తూనే ఉన్నారు. కానీ ఐదు దశాబ్దాల జీవనంలో తెలంగాణ భాష ఆంధ్రమాటలు, యాస కలుపుకొని ఆంధ్రభాష ననుకరించిందే గాని ఎన్నడూ తెలంగాణ మాటల్ని యాసను ఉచ్చారణను ఆంధ్రభాష తనలో కలుపుకోలేదు. పైగా అస్పృశ్యంగానే ఉంచగలిగింది. సంస్కృతి విషయంలో కూడా అంతే జరిగింది. విభిన్న సంస్కృతులతో ఐక్య జీవనం గడిపి కలుపగలిగిన తెలంగాణా సంస్కృతి ఇయ్యాల్ల ఆంధ్ర సంపన్న వర్గాల సంస్కృతి చేతిలో విపరీతమైన ఆత్మన్యూనతకు లోనవుతున్నది. ఆంధ్ర సంస్కృతి అవహేళనలో తెలంగాణ అస్థిత్వాన్ని కోల్పోతున్నది.

తెలంగాణ ప్రజలకు భాషరాదని, సంస్కృతి తెలియదని బండ సంస్కృతి, బగ్గడి సంస్కృతి (మోటు) అని మాట్లాడుతున్నరు. తెలుగువారై ఉండీ హైద్రాబాద్‌లో ఉండీ తెలుగు వాళ్ళ పాలనలో ఉండి ఈ ఐక్య రాష్ట్రంలో వేర్పాటు భావన ఎదుర్కొన వలసి వస్తున్నది. నిజాయితీ ఉండీ. కష్టం చేసి పోరాటాలు చేసిన చరిత్ర వుండీ, తెలంగాణ వాళ్ళు తెలివిలేనివాళ్లని సోమరిపోతులని పనిచేతకాని వాళ్ళని ఆంధ్ర పాలన సంస్కృతి అవహేళన చేస్తూ అణచి వేస్తున్నది. తెలంగాణా ప్రజలకు నిజాయితీ ఎక్కువ. నమ్మిన ఆశయాల కోసం ప్రాణాలిచ్చింంద్రు. నిలబడ్డరు. నిలబెట్టింంద్రు. తెలంగాణ సంస్కృతిలో తిరుగుబాటు స్వభావం ఎక్కువ. ప్రపంచంలోనే గుర్తింపు పొందిన ఒక గొప్ప పోరాటాన్ని నిర్మించింంద్రు. పనిచేసి పనిని గౌరవించటంలో పని సంబంధాల ద్వారా ఎన్ని సంపదలు సృష్టించగలిగినారో (ఆనాడు నిజాం ఈనాడు ఆంధ్ర) పాలక వర్గ విలాసాలే నిదర్శనం. ఒక్క తెలంగాణనే కాదు. వెనుకబడిన జాతులన్నీ, సంస్కృతులన్నీ, ప్రత్యేకతలను, శ్రమని, నిజాయితీ, మానవీయ విలువలు, ఆర్తి, పోరాట సంప్రదాయాలు కలిగి వుంటాయి. ఆంధ్రానే కాదు అన్ని అభివృద్ధి చెందిన సంస్కృతులు దోపిడీ స్వభావం, మ్యానిపులేషన్, పైరవీ, వ్యాపార విలువలు, ఆధిపత్య సంప్రదాయాలు కలిగి వుంటయి. అయితే అభివృద్ధి చెందిన సంస్కృతులు, పైరవీ సంస్కృతులు వెనకబడిన సంస్కృతులను, పనిచేసే సంస్కృతులను ఎగతాళి



చేస్తాయి. పెత్తందారీ విధానాలతో తమ బూర్జువా సంస్కృతుల్ని ఇతర సంస్కృతుల మీద రుద్ది దోపిడి తొవ్వలు సాఫు చేసుకుంటాయి.

తమిళ ప్రజల చేతిలో సాంస్కృతిక అవమానాలు పొందిన కోస్తాంధ్ర బూర్జువా వర్గం తెలంగాణ భాష, సంస్కృతుల్ని అవమానిస్తూ ఆధిపత్యం నిరూపించుకోగలి గింద్రు. ఆంధ్రా పాలనలో తెలంగాణ ప్రజల పరిస్థితి పెనం మీంచి పొయ్యిల పడ్డట్టయింది. భూమి, నీరు, కరెంటు, మొదలైన ముఖ్య వనరులు కోల్పోవటంతో పాటు, భాష, సంస్కృతులపరంగా అడుగడుగునా అవమానాలు పొంది తల్లడిల్లుతున్నరు.

దిన పత్రికలన్నీ ఆంధ్ర పెట్టుబడిదారులవి (రెండు పత్రికలు రాష్ట్రేతరులవి ఉన్నప్పటికీ కీలకస్థానాల్లో ఉన్న వాళ్ళు ఆంధ్ర వాళ్ళే) అవటం వల్ల తెలంగాణ మాటలు, భాష ఉపయోగించ కుండా జాగ్రత్తగా కాపలాకాస్తుంంద్రు. తెలంగాణ విలేఖరులు తమ భాషలో వార్తలు రాస్తే వాటిని ఎడిట్ చేసి ఆంధ్రభాషకు అనువదిస్తున్నారు. శ్రమదానంలో "లొట్టపీసు చెట్లు తీసేశారని రాస్తే (మెదక్ జిల్లా ఎడిషన్‌లోనే) దాన్ని "పిచ్చి మొక్కలు" అని మార్చారు. పిచ్చి మొక్కలు ఇక్కడ ప్రజలకు తెలువవు. ప్రెస్ అకాడమీ ఛైర్మన్ వార్తా రచన మెలకువలు చెప్పేటప్పుడు "బట్టలు" అని రాయకూడదు. "గుడ్డలు' అని రాయమని పేపర్ సమర్పించిండు. "బట్టలు" అని రాస్తే ప్రింటింగ్ తప్పు పడితే బూతవుతుందని వాదం. ఆ ప్రమాదం చాలా మాటలకు ఏర్పడవచ్చు. 'తుఫాన్' గురించి రాస్తే వార్తవుతది. తీవ్రమైన కరువు గురించి రాస్తే వార్తకాదు. దిన వార పత్రికల్లో రెగుల్యర్ కాలమ్స్‌లో తెలంగాణ భాషను ఘోరంగా అవమానిస్తున్నరు. చదివే వాళ్ళకెంత బాధయితదో కెరీర్ చూసుకునే రచయితలకు అర్థం కాదు. తెలంగాణ వాళ్ళు ఆడపిల్లను "తోలుకరావటం" అంటరు. అది పశువులకు వాడే మాటనీ తెలంగాణ వాళ్ళకు స్త్రీలను గౌరవించటం తెలువదని ఒక నెల్లూరు రచయిత్రి పెద్ద వ్యాసమే రాసింది. 'తోలుక' రావటం బదులు 'తీసుక' రావటం అనాలని సంస్కరించే ప్రయత్నం చేసింది. మూడు కోట్ల మంది మాట్లాడే భాషను, పలుకుబడిని అవహేళన చేస్తూ ఆ వ్యాసం సాగింది. 'తీసుకరావటం' అనే మాట తెలంగాణ సంస్కృతిలో జడపదార్థాలకు నిర్జీవ పదార్థాలకు వాడతారు మరి.

తెలంగాణ భాషంటే సినిమా వాళ్ళకు మరీ అగ్వ. లెక్కే లేదు. సినిమాలల్ల జోకర్ల భాష. విలన్ల, రౌడీల భాషయిపోయింది. తెలంగాణ పేరుల మీద ఆంధ్ర ప్రాంతంలో సినిమాలు తీసి తెలంగాణ డబ్బులు చేసుకుంటుంంద్రు. తెలంగాణ భాష పోలీసోళ్ళకు పెట్టి ఎగతాళి చేస్తరు. 'నిజహీరో'లు తెలంగాణ వాళ్ళయితే 'తెరహీరో'లకు ఆంధ్ర భాష పెడుతుంంద్రు. ప్రచారానికి ఇక్కడిపాటలు కావాలి. మాటలొద్దు. 'యాదగిరి' పేరు పెట్టుకొన్నందుకు పేరు హాస్యం చేసింంద్రు. కరీంనగర్ అమ్మాయి కోడలుగా వద్దని, అది మాట్లాడితే లొల్లి (గొడవ) పెట్టినట్లుంటదని ఒక ఆంధ్ర మాత తన కొడుకును ఒక సిన్మాలో బతిమిలాడుతది. ఒక ముఖ్యమంత్రి తెలంగాణ భాష మాట్లాడితే

ఆయన దిగిపొయ్యేదాంక అవహేళన చేసిందొక పత్రిక. దానికి కార్టూనిస్టు అసహ్యపు బుద్ధులు మరిన్ని. ఆ భాష అసలైన ప్రజల భాష అన్నందుకు తెలంగాణ కవిని ఇజ్జత్ దీసిందదే పత్రిక. రేడియో, టీవీల్లో తెలంగాణ భాషను ఎంత ఖూని చెయ్యాల్నో అంతా చేస్తున్నరు. ఒక ఛానళ్ళో విద్యావంతులై ఉద్యోగం చేసే ఒక తెలంగాణ మహిళ భాషను, అభిప్రాయాల్ని ఒక ఆంధ్రా గృహిణి అవహేళన చేస్తుంది. ఇట్లా వందలాది ఉదంతాలు చెప్పొచ్చు.

తెలంగాణ అతిథి మర్యాదగా 'చల్ల' ఇచ్చే సంప్రదాయముంది. దాన్ని 'చల్ల' అనగూడదు 'మజ్జిగ' అనాలనీ కనీసం బట్టర్ మిల్క్ అనాలని బల్మీటికి రుద్దుతున్నారు. 'చల్లగ' ఉండేది 'చల్ల'. తెలంగాణ అంతట వాడుకలో ఉన్న ఎన్నో మాటల్ని అణిచివేసింద్రు. ఈ ఎనిమిదో దశాబ్దం తర్వాత ఆంధ్రుల వలస బాగా పెరిగింది. ఆంధ్రా హోటళ్ళు విపరీతంగా వెలిసినయి. తెలంగాణ యజమానులు తెలంగాణ కస్టమర్స్ కోసం తెలంగాణ జిల్లాల్లో పెట్టిన హోటళ్ళకు కూడా "ఆంధ్ర భోజనం దొరుకును" అని బోర్డులుంటున్నయంటే పరిస్థితి ఎంత తీవ్రంగా ఉన్నదో అర్థం చేసుకోవలసి ఉన్నది.

ఒకజాతి, ప్రాంత సంస్కృతుల్లో వేష భాషలు, ఆహార పానీయాలు ఆచార వ్యవహారాలు, కళా సాహిత్యాలు ముఖ్య పాత్ర వహిస్తాయి. ఇయ్యాల్ల తెలంగాణ మాటలే కాదు. వంటకాలన్నీ 'వలస' వంటల దుమారంతో కొట్టుకుపోతున్నాయి. పప్పుచారు, పచ్చిపులుసు పోయినయ్. సాంబారు, రసం పచ్చేశాయ్. తమిళులు ఆంధ్రుల మీద రుద్దినవి కొన్ని, ఆంధ్రులవి కొన్ని మొత్తం తెలంగాణ ప్రజల రుచుల మీద రుద్దుతున్నప్పుడు "స్వగృహాఫుడ్స్" వచ్చినంక ఆంధ్ర వంటకాల ఆధిపత్యం మరింత పెరిగిపోయింది. వలస వాదులు అంటగట్టిన రుచులు, పండుగలు, అంతర్గత వలసలు రుద్దుతున్న రుచులు, పండుగలు తెలంగాణ సాంస్కృతిక జీవనం మీద దాడి చేస్తున్నాయి.

ఆంగ్ల భాషలాగే ఆంధ్ర భాష, మాటలు మాట్లాడటం ఫాషన్ కింద ఎద్యుకేషన్ కింద లెక్కించబడుతున్నది. తెలంగాణల తెలుగుకోసం ఉద్యమించిన సంఘానికి "ఆంధ్ర మహాసభ" అనే పేరు. తెలంగాణ సాంస్కృతిక వికాసం కోసం వెలిసిన మొదటి రెండు గ్రంథాలయాలకు ఆంధ్ర ప్రభువుల పేర్లు. హైద్రాబాద్‌లో కృష్ణదేవరాయ భాషా నిలయం. వరంగల్‌లో రాజరాజనరేంద్ర భాషా కేంద్రం. ఇప్పటిపాలకులకయితే అసలు గ్రంథాలయాల మీదే శ్రద్ధ వుండదు. మూసేస్తే ఖర్చు తగ్గుతుందని ఆలోచిస్తరు. తెలంగాణ దేవాలయాల మీది శిల్ప కళను పరిశోధించి జాయపు సేనాని రచించిన "నృత్య రత్నాకరం" పరిశీలించి కాకతీయుల కాలం నాటి నాట్య కళను సంభావించి రూపొందించిన తెలంగాణ సాంప్రదాయ నృత్యానికి "ఆంధ్ర నాట్యం" అని పేరు పెట్టడంలో సమ్మతి కోసం పడే 'లౌల్యం' వున్నది.



తెలంగాణ జిల్లాల్లో మూడు రేడియో స్టేషనులుంటే ఒక్క కేంద్రంలోనన్నా తెలంగాణ భాషా సంస్కృతుల కార్యక్రమాలుండవు. ఉన్న ఒక్క తెలంగాణ విశ్వవిద్యాలయంలో గాని, రాజధానిలో విశ్వ విద్యాలయాల్లో గాని ఒక్క తెలంగాణ సాహిత్య అధ్యయనముండదు. ఒక్క తెలంగాణ కవి ప్రత్యేక అధ్యయనాలుండయి.

భాష అదుపు తెచ్చుకుంటే వాటితో భావజాలం, జీవితం కూడా వచ్చి చేరుతయి. భాష పరాయీకరణ చెందితే సృజనాత్మకత కోల్పోతది. తమది కాని జీవితం ప్రవేశిస్తే సజీవకళా రూపాలు సృష్టించలేదు. కరీంనగర్, ఆదిలాబాద్ ప్రజా పోరాటలు చిత్రిస్తూ తెలంగాణ భాషలో సాహిత్యం వస్తే ఇవి అర్థం కావని, చదవలేమని ప్రగతివాదులు సైతం ఉదుక్కున్నరు. తెలంగాణ కవుల కవిత్వంలో శిల్పం లేదని, రొటీన్‌గా ఉంటుందని విమర్శకులు వాటిని పట్టించుకోలేదు. ఇక్కడి కవులు జీవన సంస్కృతుల, విశ్వాసాల మీద చులకన భావంతో చూసింద్రు, వలస, వాణిజ్య సంస్కృతుల ప్రభావంతో ప్రజల సజీవ సంస్కృతిని అణిచివేసే శిల్పాన్ని పదును పెడుతుంద్రు. విద్యా విషయక, ఉద్యోగ విషయక రాత, మౌఖిక పరీక్షల్లో తెలంగాణ విద్యార్థులు తమ భాషను ఉపయోగించడానికి వీల్లేని దుర్మార్గమైన పరిస్థితి తీసుకొచ్చింద్రు. ఇంగ్లీషు నేర్చినట్లే ఆంధ్ర భాషను నేర్చుకునేందుకు విద్యార్థికి ఎంత సమయం, ప్రతిభ వ్యర్థమైపోతుందో గమనించాలె. ఇక్కడి అధ్యాపకులు ముఖ్యంగా తెలుగు అధ్యాపకులు తెలంగాణ భాష మాటలు ఉపయోగిస్తే తెలంగాణ విద్యార్థులు కూడా చులకనగా చూసే పరిస్థితి ఉన్నదంటే, సిన్మాలల్ల తెలంగాణ భాష విని, చూసి తెలంగాణ వాళ్లే నవ్వుకునే పరిస్థితి ఉన్నదంటే మానసిక బానిసత్వం, ప్రచార బలం, ఎంత తీవ్రంగా పరిణమించిందో అర్థం చేసుకోవాలె.

తక్కువ భాషలని, ఎక్కువ భాషలని ఉండవు. తక్కువ సంస్కృతులు ఎక్కువ సంస్కృతులు ఉండవు. భావనలు, భావజాల విలువలు ఆధారంగా ప్రమాణాలు ఏర్పడతాయి. ఏ ప్రాంత ప్రజల భాష, సంస్కృతులయినా వివక్షకి గురయితే వికాసం పొందలేవు. ఉద్దేశ్యపూర్వకంగా వివక్షలు, విభేదాలు కొనసాగిస్తున్న వ్యవస్థలు ధ్వంసం చేయటానికి ఉద్యమించాలే. అన్ని రకాల ఆధిపత్యాలు ఛేధించడానికి కొట్లాడాలే. వివక్ష, ఆధిపత్య వ్యవస్థలు అదృశ్యమై ప్రజాస్వామిక భావలేర్పడినప్పుడే ప్రజల భాష, సంస్కృతులు కళలు వికాసం పొందతయి.

# 610 జీవోకు పట్టిన గతే గిర్‌గ్లానీ కమీషన్‌కూ!

**- సి. విఠల్**

అసెంబ్లీలో దుమారం లేపిన గిర్‌గ్లాని కమీషన్ నివేదిక ఉద్యోగరంగంలో తెలంగాణకు జరుగుతున్న అన్యాయాలకు ఒక సజీవ సాక్ష్యం. ఈ కమీషన్ను జూన్ 2001లో నాటి చంద్రబాబు ప్రభుత్వం నియమించింది. స్థానిక రిజర్వేషన్ల, 610 జీవో అమలు తీరు తెన్నులను పరిశీలించి తగు సూచనలను ఇవ్వమని జె.ఎం. గిర్‌గ్లానీ సభ్యుడిగా ఈ ఏకసభ్య కమీషన్ ఏర్పడింది.

కమీషన్ 6 అక్టోబర్ 2001 నాడు మధ్యంతర నివేదికను 30 సెప్టెంబర్, 2004 నాడు తుది నివేదికను ప్రభుత్వానికి సమర్పించింది. తుది నివేదికలో మూడు సంపుటాలున్నాయి. ఇందులో మొదటిది ముఖ్యమైనది. రాష్ట్రపతి ఉత్తర్వుల అమలు కమీషన్ నివేదిక మొదటి సంపుటిలో ఉన్నది. మిగతా రెంటిలో కమీషన్ సేకరించిన సమాచారాన్ని పొందుపర్చారు. కమీషన్ తుది నివేదికను సెప్టెంబర్ 2004లోనే సమర్పించినా ప్రభుత్వం దాన్ని బహిర్గత పర్చి ప్రజల్లో గాని, అసెంబ్లీలో గాని చర్చకు పెట్టలేదు. తెలంగాణవాదులు, తెలంగాణ ఉద్యోగులు ఆందోళన చేపట్టిన తరువాతే ప్రభుత్వం నివేదికను బహిర్గతం చేసింది.

నివేదిక మొదటి అధ్యాయంలోనే స్థానికులకు కల్పించిన రిజర్వేషన్ల స్వభావాన్ని వాటి ఉల్లంఘనకు దారితీసిన పరిస్థితులను వివరించింది. నివేదికను అర్థం చేసుకోవాలంటే రిజర్వేషన్ల చరిత్ర కొంత తెలుసుకోవటం అవసరం. స్థానికులకు రిజర్వేషన్లు తెలంగాణాలో స్వాతంత్ర్యానికి పూర్వమే అమలులోకి వచ్చాయి. ఈ రిజర్వేషన్లనే ముల్కీ నిబంధనలని అంటారు. 1956లో తెలంగాణ ఆంధ్ర రాష్ట్రంలో విలీనం అయినప్పుడు ముల్కీ



రూల్సును కొనసాగిస్తామని పెద్ద మనుషుల ఒప్పందం ద్వారా హామీ ఇచ్చారు. అయితే ఈ రూల్సు సక్రమంగా అమలుకాలేదు. 1968లో ప్రత్యేక రాష్ట్ర ఉద్యమం తలెత్తడానికి ఇది ఒక ప్రధాన కారణం. అప్పుడు ప్రభుత్వం ముల్కీ నిబంధనలకు వ్యతిరేకంగా నియమించబడిన 28,000 ఉద్యోగులను వెనక్కి పంపిస్తామని హామి ఇచ్చింది. ఆ నిర్ణయం మేరకు జీవో 36ను జారీ చేసింది. ఈ జీవో అమలును, ముల్కీ రూల్సును వ్యతిరేకిస్తూ కొందరు హైకోర్టులో కేసు వేశారు. కేసు హైకోర్టులో, సుప్రీంకోర్టులో చాలాకాలం సాగింది. చివరకు సుప్రీంకోర్టు 1972లో ముల్కీ రూల్సు రాజ్యాంగబద్ధమేనని చారిత్రాత్మక తీర్పునిచ్చింది.

సుప్రీంకోర్టు తీర్పు నచ్చని ఆంధ్ర నాయకులు జై ఆంధ్ర ఉద్యమాన్ని ఉసిగొల్పారు. ఆ ఉద్యమ లక్ష్యం తెలంగాణకున్న రక్షణలను రద్దుచేయించడం. ఉద్యమ ఫలితంగానే ముల్కీ నిబంధనలు రద్దయ్యాయి. ముల్కీ నిబంధనలు, తెలంగాణకున్న ఇతర రక్షణలను రద్దుచేసి వాటి స్థానంలో కేంద్ర ప్రభుత్వం 1973లో ఆరుసూత్రాల పథకాన్ని ప్రవేశపెట్టింది. ఈ పథకంలోని మూడవ అంశం ప్రకారం ఏ ప్రాంతం వారికి ఆ ప్రాంత ఉద్యోగాలలో రిజర్వేషన్లుంటాయి. ఆరు సూత్రాల పథకానికి రాజ్యాంగ బద్ధతని కల్పించడానికి ప్రభుత్వం 32వ రాజ్యాంగ సవరణ ద్వారా రాజ్యాంగంలో ఆర్టికల్ 371(డి)ని ప్రవేశపెట్టింది. విద్యా, ఉద్యోగ రంగాలలో రాష్ట్రాలలోని అన్ని ప్రాంతాల వారికి సమానావకాశాలను కల్పించడానికి తగు ఉత్తర్వులను జారీచేసే అధికారాన్ని పై ఆర్టికల్ రాష్ట్రపతికి కల్పించింది.

రాష్ట్రపతి 371 (డి) ఆర్టికల్ ప్రకారం 18-10-1975 నాడు స్థానికులకు ఉద్యోగాలలో రిజర్వేషన్లను కల్పిస్తూ ఉత్తర్వులను జారీ చేశాడు. ఈ ఉత్తర్వుల ప్రకారం రాష్ట్రాన్ని ఆరు జోన్లుగా విభజించారు. ఇందులో ఉత్తర తెలంగాణ జిల్లాలు ఐదవ జోనులోను, దక్షిణ తెలంగాణ జిల్లాలు ఆరవ జోనులోను భాగమయ్యాయి.

రాష్ట్రపతి ఉత్తర్వుల ప్రకారం స్థానికులకు ఉద్యోగాలలో రిజర్వేషన్లను ఈ క్రింది విధంగా కల్పించడం జరిగింది. జూనియర్ అసిస్టెంట్ దాని సమాన క్యాడర్ వరకు జిల్లాను ఒక యూనిట్‌గా పరిగణిస్తారు. అంటే ఏ జిల్లావారు ఆ జిల్లా స్థాయి ఉద్యోగాలలో రిజర్వేషన్లకు అర్హులు. ఈ స్థాయి ఉద్యోగాలలో స్థానికులకు 80శాతం రిజర్వేషన్ 20శాతం ఓపెన్ కోటా ఉద్యోగులుగా ప్రకటించారు.

జూనియర్ అసిస్టెంట్ పై స్థాయిలో ఉన్న నాన్ గెజిటెడ్ క్యాటగిరీ పోస్టులకు జోన్‌ను ఒక యూనిట్‌గా పరిగణిస్తారు. ఈ పోస్టులలో జోను వారికి 70శాతం ఉద్యోగాలు రిజర్వు అవుతాయి. మిగతా 30శాతం ఉద్యోగాలను ఓపెన్ కేటగిరీ ఉద్యోగులుగా పరిగణిస్తారు.

గెజిటెడ్ పోస్టులలో సివిల్ అసిస్టెంట్ సర్జన్, జూనియర్ ఇంజనీర్, తాసీల్దార్ పోస్టులకు కూడా (వీటిని స్పెషల్ గెజిటెడ్ పోస్టులు అంటారు) జోనును ఒక యూనిట్‌గా

గుర్తిస్తారు. ఈ ఉద్యోగాలలో జోనుకు చెందిన స్థానికులకు 60శాతం రిజర్వు అవుతాయి. మిగిలిన 40శాతం ఓపెన్ కేటగిరీ పోస్టులవుతాయి. ఓపెన్ కేటగిరీ పోస్టులలో ప్రాంతంతో నిమిత్తం లేకుండా ఎవరికీ ఎక్కువ మార్కులు వస్తే వారే అర్హులు. వారితోనే ఆ పోస్టులను భర్తీ చేయాలి. అంతే తప్ప అవి ప్రాంతేతరులకు రిజర్వు చేయబడిన ఉద్యోగాలు కావని గమనించాలి.

ఆరు సూత్రాల పథకం ప్రకారం ఒక వ్యక్తి నాలుగు సంవత్సరాలు ఒక ప్రాంతంలో నివసిస్తే స్థానికుడవుతాడు. అంతకుముందున్న ముల్కి నిబంధనల ప్రకారం ఏ వ్యక్తినైనా 12 సంవత్సరాల స్థిరనివాసం ఉంటేనే స్థానికుడిగా గుర్తించేవారు. అంతేకాదు ముల్కీ నిబంధనల ప్రకారం మొత్తం ఉద్యోగులను స్థానికులకే ఇచ్చేవారు.

మరొక ముఖ్యమైన విషయమేమంటే రాష్ట్రపతి ఉత్తర్వుల ప్రకారం దిగువ ఆఫీసులలో స్థానిక రిజర్వేషన్లు వర్తించవు.

1. రాష్ట్ర సచివాలయం
2. శాఖాధిపతుల (హెడ్ ఆఫ్ ది డిపార్ట్‌మెంట్) కార్యాలయాలు
3. రాష్ట్ర స్థాయి స్పెషల్ ఆఫీసులు
4. రాష్ట్రస్థాయి ఆఫీసులు, సంస్థలు
5. ఐదు కోట్లకు పై బడిన మేజర్ డెవలప్‌మెంట్ ప్రాజెక్టులు (ఈ భారీ ప్రాజెక్టులను 1985లో రాష్ట్రపతి ఉత్తర్వుల పరిధిలోకి తెచ్చారు. అయితే జూనియర్ ఇంజనీర్ స్థాయి స్పెషల్ గెజిటెడ్ పోస్టులను మినహాయించారు.) అయితే రాష్ట్రపతి ఉత్తర్వుల ప్రకారం పై ఆఫీసుల్లోను అన్ని ప్రాంతాల వారికి న్యాయసమ్మతమైన వాటా కల్పించాలి. ఆరు సూత్రాల పథకం తెలంగాణ వారికి ముల్కీ నిబంధనల వలన సంక్రమించిన హక్కులను నీరుగార్చిందని పై వివరాలను బట్టి గమనించవచ్చు. స్థానిక రిజర్వేషన్లు కొన్ని ఉద్యోగాలకే వర్తిస్తాయి. అంతేకాక ఆరుసూత్రాల ప్రకారం తెలంగాణ ఒక యూనిట్ కాదు. కాబట్టి ఉత్తర తెలంగాణ వారు హైదరాబాదులో నాన్‌లోకల్ అవుతారు. కనుక ఈ సూత్రాల వలన తెలంగాణాకు అన్యాయమే జరిగింది. అందులో ఎవరైనా తెలంగాణలో నాలుగేళ్ళుంటే లోకల్ అయిపోతారు. కనుక ప్రాంతేతరులకు అతి సులువుగా తెలంగాణలో ఉద్యోగాలు పొందే అవకాశం కలిగింది.

1975లో వెలువడిన రాష్ట్రపతి ఉత్తర్వులు తెలంగాణలో సక్రమంగా అమలుకాలేదని, ఆరు సూత్రాల పథకం అతిక్రమించబడిందనీ 1985లో ప్రభుత్వానికి ఫిర్యాదులు వచ్చాయి. ఈ ఫిర్యాదులపై అప్పటి ప్రభుత్వం ఐ.ఎ.ఎస్ అధికారులైన జయభారతరెడ్డి, కమలనాథన్, ఉమాపతిలతో ఒక కమిటీని వేసింది. ఈ కమిటీ 36 పేజీల నివేదికను అప్పటి రాష్ట్ర ప్రభుత్వానికి సమర్పించింది. ఈ నివేదిక ప్రకారం తెలంగాణాలో 1985 నాటికే 59,000 స్థానికేతరులు నియమించబడినారు. వారిని



వెనుకకు పంపించడానికి త్రిసభ్య కమిటీ సూచనల మేరకే ప్రభుత్వం 610 జీవోను జారీచేసింది. రాయలసీమ ఉద్యోగులు రాష్ట్రపతి ఉత్తర్వుల అమలుగురించి అదే రకమైన ఫిర్యాదులు చేయగా, వారికి అదే రకమైన హామీలు ఇస్తూ జీవో 564 జారిచేసింది ప్రభుత్వం. డిసెంబర్ 30, 1985న జారీ అయిన 610 జీవోని మార్చి 31, 1986లోగా అమలుచేయవలసి ఉండగా ఇప్పటివరకు కూడా అది అమలుకాలేదు.

జీవో 610 ప్రకారం అక్రమంగా నియమింపబడిన స్థానికేతరులను వెనుకకు పంపించాలి.రాష్ట్రపతి ఉత్తర్వులలో లేని గెజిటెడ్ పోస్టులను ఉత్తర్వుల పరిధిలోకి తేవాలి. రాష్ట్ర స్థాయి ఆఫీసులలో అన్ని ప్రాంతాల వారికి న్యాయ సమ్మతమైన వాటా కల్పించాలి. రాష్ట్రపతి ఉత్తర్వులకు భిన్నంగా జరిగిన బదిలీలను రద్దుచేయాలి. కాని జీవో 610 ఆ తరువాత కనుమరుగైంది. 2001లో తెలంగాణ ఉద్యమం బలపడిన తరువాతే అది మళ్ళీ వెలుగులోకి వచ్చింది. శాసనసభలో జీవో పైన చర్చ చెలరేగింది. చర్చ పర్యవసానంగానే స్థానిక రిజర్వేషన్లను దాని ఉల్లంఘనను సవరించడానికి ఉద్దేశింపబడిన 610 జీవోను సక్రమంగా అమలుచేయడానికి సూచనలిమ్మని ప్రభుత్వం గిర్‌గ్లానీ కమీషన్‌ను నియమించింది.

స్థానిక రిజర్వేషన్లు రాజ్యాంగ బద్ధంగా సంక్రమించినవే కాబట్టి వాటిని ఉల్లంఘించడమంటే రాజ్యాంగాన్ని ఉల్లంఘించడమేనని గిర్‌గ్లాని కమీషన్ ప్రకటించింది. దాంతో పాటు గత 30 సంవత్సరాలుగా పాలనాయంత్రాంగం నిర్ణయాలను తీసుకునేటప్పుడు రాష్ట్రపతి ఉత్తర్వుల స్పృహ లేకుండా పనిచేసిందని, మారుతున్న పరిస్థితులకు తగినట్టుగా పాలనా యంత్రాంగంలో మార్పులు అనివార్యమే, అయినా ఆ మార్పులు ఆరు సూత్రాల పథకానికి లోబడి, ఆ చట్టానికి భంగం కలుగకుండా జరుగవలసి ఉండిందని, అయితే అధికారులు రాష్ట్రపతి ఉత్తర్వులనే పట్టించుకోలేదని నివేదిక పేర్కొన్నది. రిజర్వేషన్ల అమలును పర్యవేక్షించే సంస్థ లేకపోవడం వలన ఉల్లంఘనలు నిరాటకంగా సాగిపోయాయని చెప్పింది.

కమీషన్ ఉల్లంఘన రూపాలను కూడా వివరించింది. మొత్తం 18 రకాల ఉల్లంఘనలు జరిగాయి. అందులో కొన్ని ముఖ్యమైనవి ఇలా ఉన్నాయి.

1. శాఖాధిపతుల (హెడ్ ఆఫ్ ది డిపార్ట్‌మెంట్) కార్యాలయాల సంఖ్యను పెంచడం ద్వారా ఆరు సూత్రాల పథకం పరిధిలోకి వచ్చే ఉద్యోగాలను కుదించారు. 1975 నాటి రాష్ట్రపతి ఉత్తర్వుల అనుబంధంలో 51 శాఖాధిపతులు కార్యాలయాలను పేర్కొన్నారు. కానీ నేడు 145 శాఖాధిపతుల కార్యాలయాలున్నాయి. ఇది పెరుగుతున్న పాలనావసరాల రీత్యా మాత్రమే జరిగినది కాదు. ఒకే శాఖకు ఒకటి కంటే ఎక్కువ శాఖాధిపతుల కార్యాలయాలను చూపించడం కూడా జరిగింది. ఏ శాఖకయినా ఒకే శాఖాధిపతి ఉంటారు. ఒకే శాఖాధిపతి కార్యాలయం ఉంటుంది. కానీ జోనల్

ఆఫీసులను కూడా శాఖాధిపతుల కార్యాలయాలుగా చూపిన సందర్భాలున్నాయి. తత్ఫలితంగా లోకల్ రిజర్వేషన్లు నీరుగారిపోయాయి.

2. మొదట్లో రాష్ట్రపతి ఉత్తర్వులలో భారీ ప్రాజెక్టుల కార్యాలయాలను మినహాయించారు. 1985లో రాష్ట్రపతి ఉత్తర్వులను సవరించి భారీ ప్రాజెక్టులను కూడా స్థానిక రిజర్వేషన్ల పరిధిలోకి తీసుకొచ్చారు. అయితే అప్పుడు ఏ కారణంగానో స్పెషల్ గెజిటెడ్ పోస్టులయిన అసిస్టెంట్ ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్, డిప్యూటీ ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్ పోస్టులను మినహాయించారు. దీనివలన ఈ పోస్టులన్నింటిలోనూ స్థానిక రిజర్వేషన్లు లేకుండా పోయాయి. తెలంగాణ ఉద్యోగుల ఫిర్యాదులకు సమాధానంగా జారీచేసిన జీవో 610లోనూ రాయలసీమ ఉద్యోగులు చేసిన ఫిర్యాదుకు సమాధానంగా జారీచేసిన జీవో 564 లోనూ కూడా ఈ స్పెషల్ గెజెటెడ్ పోస్టులు స్థానిక రిజర్వేషన్ల పరిధిలోకి వస్తాయి కాబట్టి అది న్యాయమైనదే. కానీ ఆ హామీ అమలుకాలేదు. అంతేకాక, ప్రాజెక్టు నిర్మాణం పూర్తి అయిపోయిన తరువాత ఆ పోస్టులను కొనసాగించి ప్రాజెక్టు మెయింటెనెన్స్ వగైరాల కోసం వినియోగించుకోవడం మొదలుపెట్టిన తరువాత వాటిని తరువాత వాటిని సాధారణ ఇరిగేషన్ శాఖ పోస్టులుగా చూడవలసి ఉండింది. అప్పుడైనా స్థానిక రిజర్వేషన్లు వర్తించేవి. కాని ఆ పనిచేయకుండా వాటిని ఇంకా ప్రాజెక్టు పోస్టులుగానే చూపించి స్థానిక రిజర్వేషన్లు వర్తించకుండా చేశారు.

3. పట్టణాభివృద్ధి సంస్థలలో ఒక్క హుడా మాత్రమే స్థానిక రిజర్వేషన్లు పాటిస్తున్నది. అవి ప్రభుత్వ సంస్థలే కాబట్టి వాటిని రాష్ట్రపతి ఉత్తర్వుల పరిధిలోకి తేవలసి ఉండింది. తెలంగాణకు సంబంధించినంత వరకు హైదరాబాద్ పాత నగరంలోని కులీకుతుబ్‌షా పట్టణాభివృద్ధి సంస్థ, వరంగల్‌కు వర్తించే కాకతీయ పట్టణాభివృద్ధి సంస్థలలో ఇది జరగని కారణంగా స్థానిక రిజర్వేషన్లు లేకుండా పోయాయి.

4. ఉద్యోగుల హోదాను మార్చడం ద్వారా రిజర్వేషన్ల పరిధిని కుదించారు. జిల్లా స్థాయి ఉద్యోగులను జోన్‌స్థాయి ఉద్యోగంగా మార్చి లోకల్ రిజర్వేషన్లు 80శాతం నుండి 70శాతానికి తగ్గించారు. అదే విధంగా జోనల్ స్థాయి నాన్‌గెజిటెడ్ ఉద్యోగాన్ని గెజిటెడ్ ఉద్యోగంగా మార్చడం వలన రిజర్వేషన్లని 70 నుంచి 60శాతానికి కుదించారు. కొన్ని గెజిటెడ్ ఉద్యోగాలను రాష్ట్రస్థాయి గెజిటెడ్ ఉద్యోగాన్ని గెజిటెడ్ ఉద్యోగులుగా మార్చి అసలు లోకల్ రిజర్వేషన్ లేకుండా చేశారు. ఇలా కేడరు స్థాయిలో మార్పు చేర్పులన్నీ రాష్ట్రపతి అనుమతితోనే జరగాల్సి ఉండగా రాష్ట్రపతి అనుమతిని పొందకుండానే రాష్ట్ర కేడరు స్థాయిలో మార్పు చేశారు. తద్వారా స్థానికుల కోటాను కుదించారు. నిజానికి రాష్ట్రప్రభుత్వం ఉద్యోగుల హోదాను, ఆఫీసుల స్థాయిని పెంచినా రాష్ట్రపతి ఉత్తర్వుల్లో పేర్కొన్నట్లుగానే ఆయా ఉద్యోగాలలో లోకల్ రిజర్వేషన్లు పాటించాలి. ఉదాహరణకు ఒక నాన్‌గెజిటెడ్ ఉద్యోగాన్ని ప్రభుత్వం గెజిటెడ్ ఉద్యోగంగా మార్చవచ్చు.



కానీ ఆ ఉద్యోగాలకు సంబంధించిన రిక్రూట్‌మెంటులో రాష్ట్రపతి ఉత్తర్వులలో కల్పించిన రిజర్వేషన్ సూత్రాలే వర్తిస్తాయి. అదే విధంగా ఒక ఆఫీసును రాష్ట్రస్థాయి ఆఫీసుగా మార్చినా ఆ ఉద్యోగాలను లోకల్ రిజర్వేషన్ల పరిధినుండి మినహాయించే అధికారం ప్రభుత్వానికి లేదు.

ఉద్యోగుల హోదాను మార్చినా, ఆఫీసుల పరిధిని మార్చినా నియామకాలకు సంబంధించినంత మేరకు రాష్ట్రపతి ఉత్తర్వులు ఆ ఉద్యోగాలకు కల్పించిన ప్రతిపత్తి మాత్రం మారదు. అంటే ఆ ఉద్యోగానికి రాష్ట్రపతి ఉత్తర్వుల్లో కల్పించిన స్థాయిని బట్టే రిజర్వేషన్ పాటించాలి. ఈ విషయంలో మార్పులు చేసే అధికారం రాష్ట్రానికి లేదు.

5. వివిధ స్థాయిలలో ఉండే పోస్టులలో 80, 70, 60 శాతం రిజర్వేషన్ పోగా మిగతావి ఓపెన్ కేటగిరీలో భర్తీ చేయాలి. ఈ కేటగిరీలో అందరితో పాటు స్థానికులూ అర్హులు. ఇట్లాకాక ఓపెన్ కేటగిరీ పోస్టులను నాన్ లోకల్స్‌కు రిజర్వు చేయబడిన పోస్టులుగా పరిగణించి వారిని మాత్రమే ఈ పోస్టులలో భర్తీ చేశారు. ఇది చట్ట విరుద్ధం. ఓపెన్ పోస్టులకు మెరిట్‌లో వచ్చిన అభ్యర్థులను మాత్రమే నియమించాలి.

6. చాలా రీజనల్ ఆఫీసుల పరిధికి జోన్ల సరిహద్దులకు మధ్య సమన్వయం ఉండటం లేదు. ఆఫీసుల పరిధి రెండు మూడు జోన్లకు విస్తరిస్తున్నది. తత్ఫలితంగా లోకల్ రిజర్వేషన్ల అమలుకు అవాంతరాలు తలెత్తుతున్నాయి. కనుక రీజినల్ ఆఫీసుల పరిధిని మార్చాలి. జోన్ల పరిధి, రీజనల్ ఆఫీసుల పరిధిని సవరించి లోకల్ రిజర్వేషన్లను సక్రమంగా అమలుచేయాలి.

7. ఇంజనీరింగ్ శాఖలలో ఏదయినా ఒక పని చేపట్టినప్పుడు ఆ పని నిమిత్తం ఉద్యోగులను నియమించడం జరుగుతుంది. భారీ ప్రాజెక్టులలో ఇది తరచుగా జరుగుతుంటుంది. వీరిని 'వర్క్-ఛార్జ్‌డ్' ఉద్యోగులు అంటారు. ఇవి కూడా ప్రభుత్వ ఉద్యోగాలే కాబట్టి వీటికి ఎట్టి మినహాయింపూ లేకుండా రాష్ట్రపతి ఉత్తర్వులు వర్తించాలి. రాష్ట్రపతి ఉత్తర్వులలో వర్క్-ఛార్జ్‌డ్ ఉద్యోగులకు ఏ మినహాయింపూ ఇవ్వలేదు. అయినప్పటికీ ఈ ఉద్యోగులను స్థానిక రిజర్వేషన్ల నుండి పూర్తిగా మినహాయించారు. ఎందుకని అడిగితే ఒకచోట పని అయిపోతే వారు మిషన్లతో సహా వేరొక చోటికి బదిలీ కావలసి ఉంటుంది కాబట్టి ఆ ఉద్యోగాలకు స్థానిక రిజర్వేషన్లు వర్తింప చేయలేం అన్నారు. కానీ ప్రతి ప్రాజెక్టుకూ కొత్తగా వర్క్-చార్జ్‌డ్ ఉద్యోగులను తీసుకున్నారే తప్ప, ముగిసిన వర్క్ చార్జ్‌డ్ సిబ్బంది ఏమయ్యారంటే ఆయా శాఖలోపల పర్మనెంట్ ఉద్యోగులయ్యారు. ఈ విధంగా వేలమందిని స్థానిక రిజర్వేషన్లకు విరుద్ధంగా పర్మనెంట్ చేశారు. ఒక్క నీటిపారుదల శాఖలోనే ఇటువంటి చట్టవిరుద్ధ నియామకాలు 17,161 జరిగాయని గిర్‌గ్లానీ కమీషన్ లెక్కగట్టింది.

8. రాష్ట్రపతి ఉత్తర్వుల ప్రకారం ప్రజావసరాల దృష్ట్యా ఒక స్థానిక ప్రాంతం వారిని ఇంకొక స్థానిక ప్రాంతానికి బదిలీ చేయవచ్చు. (అది జిల్లా కావచ్చు జోన్ కావచ్చు) దీనికి పరిమితులేవీ రాష్ట్రపతి ఉత్తర్వులు నిర్దేశించలేదు. అయితే దొడ్డిదారిన స్థానికేతరులను నియమించే ఎత్తుగడగా గానీ ఉండకూడదనేది స్పష్టమే. రాష్ట్రపతి ఉత్తర్వుల చరిత్రను దృష్టిలో ఉంచుకున్నప్పుడు, బదిలీలు చేయడానికి ఆ ఉత్తర్వులలో ఉన్న అవకాశాన్ని ప్రత్యేక పరిస్థితులలో మాత్రమే వినియోగించుకోవాలని గుర్తించక తప్పదు. ఇటువంటి బదిలీ ఏదైనా రాష్ట్రపతి ఉత్తర్వుల ద్వారా రూపొందించిన స్థానిక రిజర్వేషన్ల సూత్రానికి మినహాయింపు అవుతుందని గుర్తించి, అంతటి అవసరం ఉందని భావించినప్పుడే చేయాలి' అని హైకోర్టు అనింది. విచ్చలవిడి బదిలీలను హైకోర్టు తీవ్రంగా దుయ్యబట్టింది. స్థానిక రిజర్వేషన్లకు వ్యతిరేకంగా బదిలీలు ఎప్పుడు చేసినా కారణాలు స్పష్టంగా చేయాలనీ, అవి ప్రజావసరాల దృష్ట్యా గానీ సమర్థవంతమైన పాలనా ప్రయోజనాల దృష్ట్యా గానీ అత్యవసరమని తెలిపేవిగా ఉండాలనీ కూడా హైకోర్టు చెప్పింది. (గిర్‌గ్లానీకమీషన్ వివిధ ప్రభుత్వ శాఖల నుండి సమాచారం కోరగా 50శాఖలు మాత్రం ఇచ్చాయి. ఈ 50 శాఖలు 716 బదిలీలకు సంబంధించిన సమాచారం ఇచ్చాయి. అందులో 208 బదిలీలకు ఏ కారణమూ చెప్పకపోగా, 160 బదిలీలు 'కోరిక మేరకు' చేశాం అన్నారు. అంటే మొత్తం బదిలీలలో 50శాతం పైగా హైకోర్టు ఆదేశాలకు విరుద్ధంగా జరిగాయని ఈ 'శాంపిల్' ను బట్టి తెలుస్తుంది. సమాచారం అందిన 716 బదిలీలలో అత్యధికంగా '79) హైదరాబాద్‌కు కాగా, రెండవ స్థానం (61) చిత్తూరుది (వెంకటేశ్వరుడి పుణ్యమేమో)

9. బదిలీల వంటివే డిప్యూటేషన్లు కూడా. వేరే స్థానిక ప్రాంతానికి చెందినవారు 'డిప్యూటేషన్' పేరు మీద (ప్రధానంగా హైదరాబాద్‌కు) బదిలీ అయి రావడం వల్ల స్థానికుల అవకాశాలు దెబ్బతింటున్నాయి. స్థానిక రిజర్వేషన్లు వర్తించని రాష్ట్రస్థాయి సంస్థలు, శాఖాధిపతుల కార్యాలయాలు వగైరాల విషయంలో 12.5 శాతం పోస్టులు మాత్రమే డిప్యూటేషన్ ద్వారా నింపవచ్చుననీ, అందులో స్థానికుల వాటా, స్థానికేతరుల వాటా న్యాయబద్ధంగా నిర్ణయించాలని రాష్ట్రపతి ఉత్తర్వులకు అనుబంధంగా జారీఅయిన జీవో 728 అంటుంది. దానిని విరివిగా అతిక్రమించడం ద్వారా స్థానికులకు (ప్రధానంగా హైదరాబాద్ భాగంగా ఉన్న ఆరవ జోన్ వారికి) అవకాశాలు దెబ్బతిన్నాయి. నియమిత శాతాన్ని మించి డిప్యూటేషన్ మీద పంపించిన వారినందరిని వెనక్కి పంపించివేయాలని గిర్‌గ్లాని కమీషన్ సూచించింది.

10. ప్రభుత్వం కొందరిని ప్రత్యేకంగా ఆదుకునే లక్ష్యంతో ఉద్యోగాలను ఇస్తుంది. ఉదాహరణకు విధి నిర్వహణఫలో భాగంగా మరణించిన ఉద్యోగలు పిల్లలకు ఉద్యోగం ఇస్తున్నారు. అయితే ఇటువంటి నియామకాలలో రిజర్వేషన్లను పాటించడం లేదు. ఖాళీ ఎక్కడుంటే అక్కడ ఇస్తున్నారు. ఆంధ్ర ప్రాంతంలో ఉద్యోగులు మరణిస్తే వారి పిల్లలకు హైదరాబాద్‌లో ఉద్యోగాలనిచ్చారు. ఇటువంటి నియామకాలను రాష్ట్రపతి ఉత్తర్వులకు లోబడే చేపట్టాల్సి ఉన్నప్పటికీ దానిని తెలిసీ అతిక్రమించారు. దీనివల్ల కూడా హైదరాబాద్ భాగంగా ఉన్న ఆరవ జోన్ వాసులు ప్రధానంగా నష్టపోయారు.

11. భోగస్ నివాస సర్టిఫికెట్లను సృష్టించి, ఎంప్లాయిమెంటు ఆఫీసుల్లో అక్రమంగా రిజిస్ట్రేషన్ చేసుకుని చాలామంది లోకల్ రిజర్వేషను కింద ఉద్యోగాలను పొందారు. ఒక్క రంగారెడ్డి జిల్లాలోనే ఒక్క సంవత్సరం జరిగిన టీచర్ల సెలక్షన్‌లో 40భోగస్ స్థానిక సర్టిఫికెట్లు తేలాయని రంగారెడ్డి జిల్లా కలెక్టర్ చెప్పినట్టు గిర్‌గ్లాని కమీషన్ అంటుంది. నియామకాలు చేసే అధికారులు ఎంప్లాయ్‌మెంట్ ఎక్సేంజి ఇచ్చే కార్డును ప్రమాణంగా తీసుకుంటున్నారు తప్ప తాము విచారణ ఏదీ జరపడం లేదు. ఎంప్లాయ్‌మెంట్ ఎక్సేంజి వారు అభ్యర్థి ఇచ్చిన సమాచారాన్ని బట్టి పోతున్నారు తప్ప దానిపైన ఏ విచారణా చేపట్టడం లేదు. ఎంప్లాయ్‌మెంట్ ఎక్సేంజ్‌లు అక్రమ నియామకాలకు దోహదపడకుండా చూడాలని కమీషన్ సూచించింది.

12. హైదరాబాద్ నగరం ఏడవ జోన్ అనీ, ఫ్రీ జోన్ అనీ రాష్ట్రపతి ఉత్తర్వులలో లేని కల్పన ఒకటి తరచుగా ప్రభుత్వ ఆదేశాలలో కనిపిస్తుంది. ఏడవజోన్ గానీ, స్థానిక రిజర్వేషన్లకు అతీతమైన ఫ్రీ జోన్ గానీ ఏదీ లేదు. హైదరాబాద్ ఆరవ జోన్‌లో భాగం. జిల్లా స్థాయి పోస్టులకు హైదరాబాద్ జిల్లా ప్రాతిపదికన స్థానిక రిజర్వేషన్లు పాటించాలి. జోనల్ పోస్టులకు ఆరవజోన్‌లో భాగంగా స్థానిక రిజర్వేషన్లు పాటించాలి. హైదరాబాద్ ఏడవ జోన్ అనే తప్పుడు అభిప్రాయం కలగడానికి గల కారణాన్ని గిర్‌గ్లాని కమీషన్ చర్చించింది. అయితే అది స్థానిక రిజర్వేషన్లకు అతీతమైన 'ఫ్రీజోన్' అనే అభిప్రాయాన్ని అమలుచేస్తూ పోవడం జరిగింది.

13. స్థానికులకు కేటాయించిన బ్యాక్‌లాగ్ పోస్టులను తిరిగి భర్తీ చేసేటప్పుడు వాటిని 100% స్థానికులతోనే భర్తీ చెయ్యాలి. కాని ఈ బ్యాక్‌లాగ్ పోస్టులను తిరిగి లోకల్, నాన్‌లోకల్ కోటాలుగా వర్గీకరించి నియామకం జరపటం వలన మన స్థానికులకే దక్కవలసిన పోస్టులు కొన్నింటిని తిరిగి నాన్‌లోకల్స్ తన్నుకుపోయారు.

స్థానిక రిజర్వేషన్ల ప్రాముఖ్యాన్ని గిర్‌గ్లాని కమీషన్ తన తొలి నివేదికలో చాలా స్పష్టంగా, సూటిగా వివరించింది. రాష్ట్రపతి ఉత్తర్వులు రాజ్యాంగ ఆదేశాలు. కేవలం ఒక చట్టం కాదు. ఈ రాష్ట్రం ఒకటిగా ఉండడానికి అవసరమైన సున్నితమైన సమతుల్యాన్ని అది నిర్దేశించింది. కాబట్టి అన్ని పాలనాపరమైన మార్పులూ రాష్ట్రపతి ఉత్తర్వుల ప్రాతిపదికనపైననే జరగాలి. ఆ పునాది చట్టాన్ని అతిక్రమించడానికి వీలులేదు. రాజ్యాంగ సవరణ ద్వారా ఆ పునాదిని సవరిస్తే తప్ప దానికి తప్పనిసరిగా కట్టుబడి ఉండాలి. రాజ్యాంగ పరంగాను, రాజకీయపరంగాను రాష్ట్రపతి ఉత్తర్వులకుండే ప్రాముఖ్యాన్ని ఈ అభిప్రాయం చక్కగా గుర్తించింది.

కానీ ప్రభుత్వం ఆ ప్రాముఖ్యాన్ని గుర్తించకపోగా, గిర్‌గ్లానీ కమీషన్ కృషికి సరయిన సహకారం సహితం ఇవ్వలేదు. రిజర్వేషన్లకు సంబంధించిన సమాచారాన్ని అడిగితే రాష్ట్రంలోని మూడింట ఒకవంతు శాఖలు మాత్రమే కమీషన్‌కు సమాచారాన్ని ఇచ్చాయి. సత్పాలన అంటే ఇదేనా అని కమీషన్ వాపోయింది. కంప్యూటర్ యుగంలో కూడా స్వయానా ప్రభుత్వం పూనుకుంటే తప్ప కిందిస్థాయి నుంచి సమాచారం వచ్చేటట్టు లేదని కమీషన్ పేర్కొన్నది.

రిజర్వేషన్ల ఉల్లంఘనలను రూపుమాపడానికి కమీషన్ స్పష్టమైన చర్యలను సూచించింది. అవి ఇలా ఉన్నాయి.

1. లోకల్ రిజర్వేషన్ల అమలులో లోపాలను సరిదిద్దే వరకు నియామకాలను ఆపాలి.
2. రిజర్వేషన్ల అమలుకు శాశ్వత ప్రాతిపదికన శాసనసభా కమిటీని, మానిటరింగ్ అథారిటీని ఏర్పాటుచేయాలి.
3. ఉద్దేశపూర్వకంగా, పక్షపాత ధోరణితో రిజర్వేషన్లను ఉల్లంఘించిన అధికారులపై చర్యలు తీసుకోవాలి.
4. కార్పోరేషన్లకు, రాష్ట్రస్థాయి ఆఫీసులకు లోకల్ రిజర్వేషన్లను విస్తరించాలి.
5. ఉద్యోగుల సర్వీస్ రిజిష్టర్‌లో నియామకం ఏ కోటాలో జరిగింది వివరించాలి.

స్థానిక రిజర్వేషన్లపైన ఈ నివేదిక సమగ్రమైన సమాచారాన్ని, లోతైన విశ్లేషణను అందించింది. లోకల్ రిజర్వేషన్లను ఒక పద్ధతి ప్రకారం ఉల్లంఘించడం జరిగింద ఈ నివేదిక రుజువుచేసింది. అయితే ఇంత స్పష్టంగా రిజర్వేషన్ల ఉల్లంఘన జరుగుతున్న తీరును గిర్‌గ్లానీ కమీషన్ వివరించినా, ప్రభుత్వం చర్యలు తీసుకోవడం లేదు. నివేదిక అమలుకు తొందరపడమని, స్థానిక రిజర్వేషన్ల అమలుగురించి ఆలోచించి చర్యలు తీసుకుంటామని ప్రకటించింది. ఇది ఇలా ఉండగా హైదరాబాదును ఫ్రీ జోనుగా పరిగణించాలని, కార్పోరేషన్లకు, రాష్ట్రస్థాయి ఉద్యోగాలకు లోకల్ రిజర్వేషన్లను విస్తరించవద్దని కోస్తాంధ్ర నాయకులు ప్రభుత్వంపై వత్తిడి తెస్తున్నారు. మారిన ఈ పరిస్థితిలో కమీషన్ నివేదిక అమలవుతుందన్న ఆశలేదు.

ఎప్పుడో 1986 అమలుకావలసిన 610 జీవో ఎందుకు అమలుకాలేదన్న ప్రశ్నకు జవాబుగా వచ్చిన గిర్‌గ్లాని కమీషన్ నివేదిక అమలుకోసం ప్రభుత్వం ఏ చర్యా తీసుకోదని, తెలంగాణ వారికి పాలనా యంత్రాంగంలో సమాన భాగస్వామ్యం కల్పించదని అసెంబ్లీ చర్చను పరిశీలించిన వారికి స్పష్టంగానే అర్థమై ఉంటుంది. రాజ్యాంగ బద్ధంగా స్థానిక రిజర్వేషన్లు కల్పించినా ప్రభుత్వం వాటిని పట్టించుకోవడం లేదంటే తెలంగాన పట్ల కొనసాగుతున్న వివక్షకు ఇంతకన్నా సాక్ష్యాలు ఇంకేం కావాలి?

# తెలంగాణ రాష్ట్రంలోనే సామాజిక న్యాయం

- మల్లెపల్లి లక్ష్మయ్య

తెలంగాణ పట్ల కోస్తాంధ్ర పాలకుల వివక్ష, కుట్ర, నిర్లక్ష్యం వల్ల కులవృత్తులకు వాటిని అనుసరిస్తున్న కులాలకు, వాటి సామాజిక, ఆర్థిక, రాజకీయ పెరుగుదలకు దెబ్బతగిలింది. దీనివల్ల ఇతర ప్రాంతాల్లో లేని అత్యంత పేదరికం, వెనుకబాటుతనం, అశాంతి తెలంగాణలో ఇంతింతై వటుడింతై అన్నట్టు ఈ రోజు పరిష్కరించడం సాధ్యం కాదేమో అనే స్థాయికి ఎదిగాయి. ఒకొక్క అంశాన్ని మనం క్లుప్తంగానైన ఈ సందర్భంగా ప్రస్తావించుకుందాం.

## నీరు - దానిచుట్టు జీవితం

తెలంగాణలో ఒకనాడు ఎటు చూసిన జల సంపద విస్తారంగా కనిపించేది పచ్చని బయళ్లు, పండి ఒరిగిన పంటలు, కళకళలాడే చెరువులు ఎక్కడా చూసిన దర్శనమిచ్చేవి. బ్రిటీష్ కాలంలో మద్రాసు రాష్ట్రంలో ఉన్నతోద్యోగంలో ఉన్న ఏనుగుల వీరస్వామయ్య పల్లకిలో కాశీయాత్రకు బయలుదేరాడు. ఆయన ఆనాటి అనుభవాలన్నింటిని 'కాశీయాత్ర చరిత్ర' పేరిట పుస్తకంగా రాశారు. అందులో మహబూబ్‌నగర్ నుంచి మొదలుకొని హైదరాబాద్ వరకు ఆయన చేసిన వర్ణనలో తెలంగాణ పచ్చదనం ఈనాటికి మనల్ని ఆనందంలో ముంచెత్తుతుంది. ఈ రోజు మనం జడ్చర్లగా పిలుస్తున్న ఊరు పేరు ఆ రోజు ఆయన రాసింది జలచెర్ల. అంటే ఎంత నీటి సంపదతో ఆ ఊరు అలరారిందో ఆ పదంతోనే మనకు అర్థం కాగలదు.

ఇట్లా ఎన్నైన చెప్పుకుంటూ పోవచ్చు. తెలంగాణలో తెల్ల కొంగలు ఎక్కువ. ఎందకంటే నీటి వనరులు ఎక్కడ ఉంటే తెల్ల కొంగలు అక్కడ ఉంటాయి. ఈ రోజు వాటి జాడలు వెతుక్కోవాల్సిందే.

దీనికి ప్రధాన కారణం, చెరువులను నాశనం చేసి, ఆకాశం నుంచి జారిన ప్రతివాన చుక్కను కృష్ణా, గోదావరుల్లో కలుపుకొని, వాటిని తమకు నీరందించే ప్రాజెక్టుల దాకా అడ్డుకట్టలు లేకుండా తీసుకుపోవాలనే కుట్ర. ఇది పాలకుల నిర్లక్ష్యం కాదు. పకడ్బందీ వ్యూహాత్మకమైన పథకం. వందల కిలోమీటర్లు కృష్ణా గోదావరులు ప్రవహిస్తున్న ఒక్క చోట తెలంగాణ గొంతు తడవదు. దీంతో వ్యవసాయం ఆగమాగమైపోయింది. ఆర్థిక జీవితం అధ్వాన్నమైపోయింది. సరిగ్గా ఇక్కడ జీవితానికి అగాధం ఏర్పడింది. తెలంగాణ జీవితంలో చెరువు ఒక ముఖ్యమైన భాగం. దానిచుట్టూ ప్రజల జీవితం గూడు కట్టుకున్నది. పంటల సంగతి సరేసరి. దానితో పాటు ఎన్నో వృత్తులు, ఎంతో ఆర్థిక వ్యవస్థ పెనవేసుకొని ఉన్నాయి. చెరువులలో నీళ్ళున్నప్పుడు బట్టలుతికే చాకలి కుటుంబాలు దర్జాగా బతికాయి. ఈరోజు వారికి గ్రామాల్లో పనిలేదు. బోర్ వచ్చిన తర్వాత ఎవ్వరూ కూడా వాళ్లను తమ బోర్ల దగ్గర బట్టలుతుక్కోవడానికి చాకళ్ళను అనుమతిస్తలేరు. ఉమ్మడి చెరువు పోయి ఊరుకు చాకలి దూరమైపోయిందు.

ఇందులో చేపలు పట్టుకొని జీవనం సాగించే తెనుగు, బెస్తలు దిక్కుతోచని స్థితికి చేరారు. చెరువులో నీళ్ళుంటే, భూగర్భంలో జలాలుంటాయి. వాటివల్ల పండ్ల చెట్లు పెరుగుతుంటాయి. ఈ రోజు భూగర్భ జలాలు తెలంగాణలో అందకుండ పారిపోతున్నాయి. దీనివల్ల  పండ్ల చెట్లు, ఊరును ఆసుకొని ఉన్న చిట్టడవులు మరుగైపోయాయి. ఈ పరిణామం కూడా తెనుగు జాతిని అనాథలను చేసింది. భూలోక కల్పవృక్షం తాటిచెట్టు, దానిని అనుకొని ఉండే ఈతచెట్టు గౌడ్ల కులానికి అక్షయపాత్ర వంటిది. దీని వల్ల ప్రభుత్వానికి కూడా ఆదాయం వస్తున్నది. నీటి కొరత వలన, భూగర్భజలాలు అడుగంటడం వల్ల కల్లు తగ్గిపోయింది. చెట్లు కూడా తొందరగా వట్టిపోతున్నాయి. మొగి ఎండిపోయి కల్లుకు పనిరాకుండా పోతున్నవి. ఇక నీటి చుట్టూ అల్లుకున్న సంపద పశు సంపద. పశు సంపద ఎంతో మందికి ఉపాధిని అందించేది. కానీ ఈ రోజు తెలంగాణలో కరువు వలన పశు సంపద తగ్గిపోయింది. ఇప్పటికే కొన్ని జిల్లాల్లో గొర్రెలు, మేకలు ఎక్కువగానే ఉన్నాయి. కానీ ఎండాకాల మొచ్చిందంటే వలసలు పోవాల్సి వస్తుంది. గతంలో ఈ ప్రాంతానికే ఇతర ప్రాంతాల గొర్రెలు బతక వచ్చేవి. ఇంతా ఎద్దడి ఉన్నప్పటికే రాష్ట్రంలోఉన్న కోటి గొర్రెలలో తెలంగాణాలోనే 60 నుంచి 70 లక్షల గొర్రెలున్నట్లు లెక్కలు చెబుతున్నాయి. వాటి మీద ఆధారపడి బతుకుతున్న గొల్ల, కురుమలు తెలంగాణ వెనుకబాటుతనం వల్ల ఎన్నో ఇబ్బందులకు గురవుతున్నారు.

సమాజంలో వచ్చిన మార్పుల వల్ల, చెరువులు కనపడకుండా పోవడం వల్ల మట్టి కరువుతో కుమ్మరి వృత్తి కూలిపోయింది. వ్యవసాయ అనుబంధ కులాలైన వడ్ల, కమ్మరి పనులకు ఊళ్ళో చోటు లేకుండా పోయింది.



### గ్రామీణాభివృద్ధికి గ్రహణం

పాలకుల కుట్రల వల్ల నీరు తరలిపోతున్నది. అయితే అట్లాగే నిధులు కూడా మనకు దక్కకుండా పోతున్నవి. గ్రామీణాభివృద్ధికి  సంబంధిత పథకాలు తెలంగాణలో అమలు జరగవు. ఇక్కడి ప్రత్యేక పరిస్థితులకు అనుగుణంగా విధానాలు రూపొందించే ఆలోచన ఇప్పటివరకు ఏ ప్రభుత్వానికి రాకపోవడం మనం చూస్తున్నాం. ఈ ప్రాంతం పట్ల రాజకీయ నాయకులకు, అధికార యంత్రంగానికి అవగాహన లేకపోవడం ఒక కారణం. తెలంగాణలో ఉన్న తెనుగు లాంటి కులం ఆంధ్రలో లేదు. కల్లుగీత వృత్తి అక్కడ లేదు గొర్రెలు, మేకలు అక్కడ కానరావు. రాజకీయ నాయకుల్లో అధికార యంత్రాంగంలో నిర్ణయాత్మక పాత్ర వహించే గ్రూప్‌లో తెలంగాణ మనషులు లేకపోవడం శోచనీయం.

దీనివల్ల, గ్రామాలలో ఉన్న ప్రజలు, వారి కులాలు, వృత్తుల పట్ల కోసాంధ్ర నాయకులకు ఏమి తెలియదు. అయితే తెలంగాణ గ్రామాల్లో ఇప్పటికే అవకాశాలు ఉన్న వృత్తులు ఉన్నాయి. తరతరాలుగా వాటి మీద బతుకుతున్న కులాలున్నాయి.

కల్లుగీత వృత్తికి ఎంతో భవిష్యత్ ఉన్నది. దీనిని ఒక పరిశ్రమగా చేయవచ్చు. ఇప్పటికీ కేరళ, తమిళనాడు, మహారాష్ట్రలలో దీనిని ఒక పరిశ్రమగా వృద్ధి చేస్తున్నారు. కల్లును నీరాగా చేసి కోల్డ్ స్టోరేజ్‌లో పెట్టి అవసరమైన రసాయనిక ప్రక్రియల ద్వారా ఒక బ్రహ్మాండమైన కూల్‌డ్రింక్‌ని తయారుచేయవచ్చు. ఇక్కడ ఒక విషయాన్ని మనం పోల్చుకోవచ్చు. సముద్రంలో దొరికే చేపలు, రొయ్యలు, సముద్రంలో దొరికే వాటిని వ్యాపారం చేయడానికి ఎగుమతులు చేయడానికి ప్రభుత్వ ప్రోత్సాహంతో కోల్డ్‌స్టోరేజి ప్లాంటులను నెలకొల్పారు. ఎంతో ప్రయోజనాన్ని ఎన్నో  లాభాల్ని అవి అందిస్తున్నాయి. అదే అనుభవాన్ని తెలంగాణకు అందించడానికి ఏమి అడ్డమొస్తున్నది? తాటి చెట్లు, ఈత చెట్లు నుంచి దొరికే ప్రతిభాగం ప్రజలకు, కావాలంటే వ్యాపారానికి ఎంతో ఉపయోగకరం. అందువల్లనే దీనిని ఒక పరిశ్రమగా చేయాలి.

ఇదే తరహాలో నిర్లక్ష్యానికి గురవుతున్న రంగం చేనేత. రాష్ట్రంలో ఎక్కువ చేనేత కేంద్రాలు మనకు తెలంగాణలో కనిపిస్తాయి. కానీ నిధులు, సహాయాలు మాత్రం కోస్తాకు తరలిపోతూ వచ్చాయి. వీటిని లెక్కలు కనుక మనం పరిశీలిస్తే కళ్ళు తిరిగి పడిపోతాం. మూడోది గొర్రెల, మేకల పెంపకం. గొర్రెల పెంపకం ఎంతో లాభసాటి వ్యాపారం. కానీ ప్రభుత్వ సాయం ఇసుమంతైన లేదు. నాలుగు సంవత్సరాల క్రితం తెలంగాణ జిల్లాలో నీలి నాలుక వ్యాధితో లక్షలాది గొర్రెలు చచ్చిపోయాయి. ఎవ్వరూ దీని గురించి పట్టించుకున్న పాపాన పోలేదు. తుపాను వచ్చి కొబ్బరిచెట్లు పడిపోతే ఆగమేఘాల మీద నష్టపరిహారం అందుతుంది. తెలంగాణలో తాటి చెట్లు పడిపోయినప్పుడు కానీ, లక్షలాది గొర్రెల చచ్చిపోయినప్పుడు కానీ ఎటువంటి నష్టపరిహారం కాదు కదా. కనీసం వాటి మీద పరిశీలన కూడ లేకపోవడం

గమనించాలి. తెలంగాణలో అత్యధిక జనాభా కలిగిన కులాలలో తెనుగు (ముత్రాసి) కులం ఒకటి చెరువులు, అడువులు పోవడంవల్ల వీళ్ళు పూర్తిగానే ఉపాధికోల్పోయారు. పట్టణాలకు తరలివచ్చి, కూరగాయలు, పండ్లు అమ్ముకుంటున్నారు. ఇంటింటికి తిరిగి గంపల్లో కూరగాయలు, పండ్లు అమ్మకునే మహిళల్లో అత్యధికులు తెనుగు కులం మహిళలే అనేది పరిశీలించినవారికి అర్థం కాగలదు. ఈ రోజు తెలంగాణ భూములు తోటలకు ఎంతో పనికి వస్తాయి. అగ్రకులాలకు, డబ్బున్న వాళ్ళకు బ్యాంకులతో అప్పులు ఇప్పించి తోటలు పెట్టించడం కన్న ఈ కులంలోని ఉత్సాహవంతులై వారిని గుర్తించి ప్రభుత్వ భూముల్లో తోటలు పెంచడానికి ప్రభుత్వం సహాయం అందిస్తే ఎంతో బాగుంటుంది. ఇది కూడ పాలకులకు ఒంటబట్టని విషయమే.

పైన పేర్కొన్న బి.సి కులాలతో పాటు అంతకన్నా దుర్భరమైన జీవితాలను గడుపుతున్నది దళితులు. పల్లెల్లో కుల వివక్ష ఒకవైపు వాళ్ళను కుందీస్తుంటే, వ్యవసాయ కూలీలుగా జీవనం సాగిస్తున్న మాల, మాదిగలు పల్లెలను విడిచి వలసపోతున్నారు. మహబూబ్‌నగర్ జిల్లా పాలమూరు లేబర్‌లో నూటికి 90 మంది వాళ్ళే అంటే అతిశయోక్తి కాదు. ఎటువంటి వ్యాపార మెలకులు, అనుభవం లేని దళితులు మట్టి పనికి, చెత్త పనికి మాత్రమే పరిమితమై పోయి, ఆకలికి, అవమానాలకు చిరునామాగా మిగిలిపోయారు. వీళ్ళ అభివృద్ధికి రాష్ట్ర ప్రభుత్వం కేటాయించిన డబ్బులు కూడా, ఈ ప్రాంతానికన్న కోస్తా ప్రాంతంలోనే ఎక్కువ ఖర్చవుతున్నాయి. దీనివల్ల కూడా వీరి పరిస్థితి మరింత దిగజారుతున్నది.

**విద్య ఉపాధి రంగాల వివక్ష**

తెలంగాణ ప్రాంతంలోని విద్యావంతులైన యువకులు ఉపాధి అవకాశాలకు, ఉద్యోగ నియామకాలకు దూరమవుతున్నారు. రాష్ట్రప్రభుత్వ విధానాన్ని నిర్దేశించే అధికారుల్లో ఈ ప్రాంతం వాటా చాలా దారుణంగా ఉంది. ఆ లెక్కలన్నీ మనకు తెలుసు. రెండోవైపు వెనుకబడిన కులాలు, దళితులు కూడా ఈ ఉద్యోగాల నియామకాలలో చాలా పక్షపాతానికి గురవుతున్నారు. రెండోది సహజంగానే విద్యారంగంలో కోస్తాకు, తెలంగాణ ప్రాంతానికున్న వ్యత్యాసం వల్ల చాలామంది తెలంగాణ దళితులు వెనుకబడిన కులాల రాష్ట్ర క్యాడర్ ఉద్యోగాలు సంపాదించడం లేదు. ఐ.ఎ.ఎస్. ఐ.పి.ఎస్. లాంటి ఉన్నతమైన ఉద్యోగాలు తెలంగాణ దళితులకు ఒక అందని ద్రాక్షగా మారింది. యాభై ఏళ్ళ చరిత్రలో తెలంగాణ నుంచి ఒక ఐ.ఎ.ఎస్. ఒక ఐ.పి.ఎస్ అధికారి మాత్రమే సెలక్ట్ కావడం ఈ దుస్థితికి నిలువుటద్దం. ఎస్టీలలో అది కూడా లేదు.

ఎ.పి.పి.ఎస్.సిలో గ్రూప్‌వన్ ఉద్యోగాలలో కూడా తెలంగాణ దళితుల సంఖ్య వేళ్ళ మీద లెక్కపెట్టవచ్చు. ఒక్క మాటలో చెప్పాలంటే, ప్రభుత్వ విధానాలను నిర్ణయించి ప్రజల బతుకుల్లో మార్పు తీసుకురాగలిగే శక్తి ఉన్న ఉన్నత ఉద్యోగ వర్గం ఇంకా ఇక్కడ మొదలేకాలేదు. దానితో ఇక్కడ చాలా పరిణామాలు జరుగతున్నాయి. నాలుగు వందల ఏళ్ళ నుంచి చదువులో ముందు ఉన్న కోస్తాంధ్ర దళితులతో ముప్ఫై ఏళ్ళ



నుంచి చదువు నేర్చుకోవడం ప్రారంభించిన తెలంగాణ దళితులు పోటీ పడడం చాలా అసహజం. ఇట్లా కోస్తాంధ్రలో మధ్య తరగతి దళిత వర్గం ఒకటి బలంగా ఏర్పడింది. ప్రభుత్వ చట్టాలను గానీ, రాజ్యాంగం హక్కులను గానీ ఉపయోగించుకోగలిగే శక్తి వాళ్ళకు ఉంది. కనీసస్థాయిలోనైన ప్రజాస్వామ్య ప్రక్రియలో కోస్తాంధ్ర దళితులు భాగం కాగలిగారు. కారంచేడు, చుండూరు లాంటి నరమేధాలు జరిగినప్పుడు ప్రజాస్వామ్య పద్ధతుల్లో ఉద్యమాలు నడిపారు. దేశాన్ని ఒక కుదుపు కుదిపారు. కానీ తెలంగాణలో జరుగుతున్న అణచివేతకు ప్రజాస్వామ్య ప్రక్రియలో దళితులు కార్యాచరణను సాగించలేదు. ఎందుకంటే ఆ స్థాయిలో అధికార యంత్రాంగంలో వాళ్ళ మనుషులు లేరు.

రెండోది, ఈ ప్రాంతంలో యాభై ఏళ్ళ కింది వరకు చట్టాలు కాక దొరల, జాగీర్దారుల రాజ్యం సాగింది. నైజాం పాలన హైదరాబాద్‌కే పరిమితం. నిజానికి పల్లెలను శాసించింది, హింసించింది, దొరలు, జాగీర్దారులే. అందువల్ల ఇక్కడ ప్రజాస్వామ్యం అనుభవం కాదు కదా, వాసన కూడా లేదు. దళితులలో వాటిని పోరాడి, తెచ్చుకోగలిగే మధ్య తరగతి వర్గం లేదు. 1970 ప్రాంతంలో కోస్తాంధ్ర దళితుడైన కాకి మాధవరావు వరంగల్ జిల్లా కలెక్టర్‌గా పనిచేసిన సమయంలో ఆయన ఇచ్చిన అండదండలు దళితులను మేల్కొలిపాయి. ఇప్పటికే ఆ జిల్లా ప్రజలు మాధవరావును మరిచిపోలేదు. ఒకవేళ ఆ స్థాయిలో తెలంగాణ దళితులు అధికారులుంటే పరిస్థితి భిన్నంగా ఉండేది. వెనుకబాటుతనం, అణచివేత, పేదరికం, మధ్య తరగతి వర్గం లేకపోవడం వల్ల తెలంగాణ దళితులకు సాయుధ మార్గంలో పయనిస్తున్న నక్సలైట్ పోరాటమే మార్గమనిపించింది. ఒకవేళ హైదరాబాద్ రాష్ట్రం మొదటి నుండి ప్రత్యేక రాష్ట్రంలో ఉండి ఉండే ఇక్కడి దళితుల బతుకుల్లో, పేదల, కుల వృత్తులను అనుసరిస్తున్న బి.సిల బతుకుల్లో ఎంతో వెలుగు నిండేదనడానికి సందేహించాల్సిన అసవరం లేదు. భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటు వల్ల అగ్రకులాలు బలపడి, వెనుకబడిన కులాలు, దళితులు వాళ్ళకు అనుచరులుగా అడుగులకు మడుగులొత్తేవిధంగా బతకాల్సి ఉంటుందని, మహారాజనీతిజ్ఞుడు రాజ్యాంగ నిర్మాత డా॥ బాబాసాహెబ్ అంబేడ్కర్ తన రచనల ద్వారా వెల్లడించారు. ఆయన భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటుపై విస్తృతంగా రాసిన వ్యాసాలు, రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ కమిటీ (ఎస్.ఆర్.సి) కి అందించిన నివేదికలో చాలా విషయాలను వెల్లడించారు. ఆయన రచనల మొదటి సంపుటంలో ఈ విషయంపై సమగ్రమైన వివరాలున్నాయి. ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ ఏర్పడడం వల్ల రెండు, మూడు కులాలు బలపడి, ఆర్థిక, రాజకీయ, సామాజిక ఆధిపత్యాన్ని చెలాయిస్తున్నాయి. అవే కులాలు తెలంగాణ రాష్ట్రం ఏర్పాటును వ్యతిరేకిస్తున్నాయి. తెలంగాణ రాష్ట్రం ఏర్పాటు దళితులు, ఆదివాసులు, బలహీన వర్గాలు, వెనుకబడిన కులాలకు ఒక మంచి మార్పును అందించగలదు. ఆవిధంగా తెలంగాణ రాష్ట్రం ఏర్పాటును ఆహ్వానించడం, దానికోసం కలలుగనడం, కలలను పండించుకోవడం మనకర్తవ్యంగా భావించాలి.

# దేవరయాంజ్మాల్ భూ కుంభకోణం వాస్తవాలు - నివేదిక

దేవర యామ్జాల్ ఆలయ భూముల వ్యవహారంపై తెలంగాణ విద్యావంతుల వేదిక నిజనిర్ధారణ కమిటి అర్చకుల సంఘం ప్రతినిధులతోని, గ్రామ రైతులతోని మాట్లాడి విషయాలను సేకరించింది.

దేవర యామ్జాల్ గ్రామంలో అతి పురాతనమైన శ్రీ సీతారామచంద్ర స్వామి దేవాలయమున్నది. అద్భుతమైన కళాఖండాలు గల ఈ దేవాలయాన్ని గతంలో బ్రిటీష్ రాణి వారి సంతతి వారు కూడా దర్శించారు. ఈ దేవాలయ భూములే ప్రస్తుత వివాదానికి కేంద్రము. ప్రభుత్వ లెక్కల ప్రకారం ఈ దేవాలయానికి సుమారు 1400 ఎకరాల భూమి ఉన్నది. గ్రామ రైతులు ఇది దేవాలయ భూమి అన్న విషయాన్ని అంగీకరించడం లేదు. ఇట్టి భూమి 1950ల నుండి తమ ఆధీనంలోనే ఉన్నదని, అన్ని విధాలుగా అనుభవిస్తున్నామని వారు అన్నారు. అందుకు సాక్ష్యంగా పహాణీలను, ఖాస్రా పహాణీలను చూపించారు. పహాణిలో భూమి రైతుల ఆధీనంలో ఉన్నట్టుగానే నమోదైంది. ఒకవేళ ఇది దేవాలయ భూమి ఐనా కౌల్దారీ చట్టాన్ని దేవాలయ భూములకు విస్తరించి ఉంటే ఇది ఏనాడో రైతులకు చెంది ఉండేది. దేవాలయ భూములకు కౌల్దారీ చట్టం వర్తించకపోవడంతో వివాదం అప్పటినుండి కొనసాగుతున్నది.

ప్రభుత్వం ఈ భూమిని దేవాలయ భూమిగా పరిగణించి దానిపై తన అధికారాన్ని నిలబెట్టుకోవడానికి ప్రయత్నించి పలు సర్వేలు చేసి చివరకు ఈ భూమి రిజిస్ట్రేషన్ నిషేధిస్తూ 810 జీ.వోను 14-10-2004నాడు జారీ చేసింది. అప్పటినుండి భూమి క్రయవిక్రయాలకు ఆటంకాలు ఏర్పడినాయి.





భూ వివాదానికి మరొక కోణం ఉన్నది. ఈ భూములను రైతులే దున్నుకొని బతికినన్ని రోజులు సమస్యలు తలెత్తలేదు. ప్రభుత్వ సర్వేల ఫలితం ఏమైనప్పటికీనీ వాస్తవానికి భూమి రైతుల ఆధీనంలోనే ఉంటూ వచ్చింది. 1980 తరువాత క్రమంగా గ్రామంలోకి రియల్ ఎస్టేట్ వ్యాపారులు ప్రవేశించారు. ఎన్టీఆర్ 1980లలో ఈ గ్రామంలో చండశాసనుడు సినిమా షూటింగ్ చేసాడట. దాని వలన గ్రామం నలుగురి దృష్టిలోకి వచ్చిందని రైతులన్నారు. ఆ కారణంగానో మరో కారణంగానో హైదరాబాదుకు చెందిన పెద్ద కంపెనీల యజమానులు రియల్ ఎస్టేటు వ్యాపారస్తులు అక్కడ భూమి కొనడం ప్రారంభించాడు. ఔటర్ రింగ్ రోడ్డు గ్రామ శివారునుండే పోతుందన్న వార్త రావడంతో ఈ మధ్యన భూముల రేటు మరింతగా పెరిగింది. తత్ఫలితంగా గ్రామంలో రియల్ఎస్టేటు వ్యాపారం పుంజుకొన్నది.

అయితే రిజిస్ట్రేషను పైన నిషేదం ఉండడం వలన రైతులకు అమ్ముకోవడం కష్టమైంది. రైతుల కష్టమే రియల్ ఎస్టేట్ వ్యాపారస్తుల పాలిట వరంగా మారింది. ఎవ్వరూ కొనడానికి నిరాకరించిన ఈ భూమిని పలుకుబడి గల కోస్తాంధ్ర పెద్దలు నామమాత్రం తక్కువ ధరకు కొన్నారు. చట్టంలోని లొసుగులను వాడుకొని హక్కును పొందగలిగారు. చట్టంలోని సెక్షన్ 89 ప్రకారం దేవాలయ భూములను వాటిని అనుభవిస్తున్న రైతులకు మార్కెటు ధర తీసుకొని ఇవ్వవచ్చు. పూర్వం నుండి ఈ భూములను అనుభవిస్తున్న రైతుల నుండి భూమిని తక్కువ ధరకు కొని ప్రభుత్వానికి నామమాత్రపు ధర చెల్లించి రిజిస్ట్రేషన్ చేయించుకున్నారు. ప్రస్తుతానికి 25లక్షల పైన ధర పలుకుతున్న భూమిని 3-4 లక్షలకే ప్రభుత్వం వదలుకున్నది.

పూర్వం నుండి భూమి మీద హక్కుల కొరకు పోరాటం చేస్తున్న రైతుల పక్షం నిర్ణయం తీసుకోడానికి ససేమిరా అన్న ప్రభుత్వం నామమాత్రం ధరకే హడావుడి పలుకుబడి గల పెద్దలకు ఇచ్చేసింది. దీని వెంట ఉన్న పట్టికలో భూముల వెలకట్టిన తీరు, ఆ వివాదాలను వేగంగా పరిష్కరించిన తీరు స్పష్టంగా చూడవచ్చు. ఆ విధంగా 165 ఎకరాలను అతి తక్కువ ధరకు పక్షం నిర్ణయం తీసుకోడానికి ససేమిరా అన్న ప్రభుత్వం నామమాత్రం ధరకే హడావుడిగా పలుకుబడి గల పెద్దలకు ఇచ్చేసింది. ఆ విధంగా 165 ఎకరాలను అతి తక్కువ ధరకు పొందారు. అందువలన అటు రైతులు ఇటు ప్రభుత్వం ఇద్దరూ నష్టపోయారు. ప్రభుత్వానికి సుమారు 17 కోట్ల నష్టం వాటిల్లింది. నగరం చుట్టూ ఉన్న భూముల్లో సుమారు 50 శాతం ఈ రకమైన భూములే ఉన్నాయని దేవాదాయ శాఖ అధికారులు అంటున్నారు. ఎంత పెద్ద స్థాయిలో కుంభకోణం జరుగుతున్నదో ఊహించుకోవచ్చు. రైతులు ఎంతగా నష్టపోతున్నరో అర్థం చేసుకోవచ్చు. రియల్ఎస్టేట్ వ్యాపారం వలన రైతులకు లాభం జరుగుతుందన్న వాదనలో నిజమెంతో చూడవచ్చు.

# దేవాదాయ చట్టంలోని సెక్షన్ 89 (2) ప్రకారం కమీషనర్ పరిష్కరించిన వివాదాలు

| క్ర. సంఖ్య | కమీషనర్ ఆర్.సి.నెం. | అప్లికేషన్ పెట్టిన వ్యక్తి పేరు | సర్వే నెం | ఎకరాలు | గుంటలు | రిజిస్ట్రేషన్ ప్రకారం విలువ | అమ్మకానికి నిర్ణయించిన విలువ | కమీషనర్ రిపోర్టు వచ్చిన తేది | కేసు ఎంత వ్యవధిలో నిర్ణయించారు | కమీషనర్ ఉత్తర్వులు వచ్చిన తేది |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | M4/39740/04 | స్కై బ్లూ బయోటెక్ ప్రైవేట్ లి. | 677 | 14 | 6 | 4,00,000/- | 4,32,000/- | 01.01.05 | ఒకవారంలో | 03.05.05 |
| 2. | M4/4459/04 | శ్రీ అల్లూరి సత్యనారాయణ రాజు ట్రస్టు | 670, 671 672 | 14, 11 10 | 2 14 21 | 4,00,000/- | 4,32,000/- | 11.03.05 | ఒకవారంలో | 06.05.05 |
| 3. | M4/4457/05 | శ్రీ బి. సూరినారాయణరాజు | 678 | 4 | 7 | 4,00,000/- | 4,32,000/- | 11.03.05 | ఒకవారంలో | 06.05.05 |
| 4. | M4/4455/05 | శ్రీ కె. భాస్కర్ రాజు | 679 | 12 | 16 | 4,00,000/- | 4,32,000/- | 11.03.05 | ఒకవారంలో | 06.05.05 |
| 5. | M4/4456/05 | శ్రీ ఎం. రామారాజు | 678 | 4 | 7 | 4,00,000/- | 4,32,000/- | 11.03.05 | ఒకవారంలో | 06.05.05 |
| 6. | M4/4558/05 | శ్రీ రాఘవరాజు | 678 | 4 | 7 | 4,00,000/- | 4,32,000/- | 11.03.05 | ఒకవారంలో | 06.05.05 |
| 7. | M4/4454/05 | శ్రీ బి. రామరాజు | 675 | 4 | 7 | 4,00,000/- | 4,32,000/- | 11.03.05 | ఒకవారంలో | 06.05.05 |
| 8. | M4/4460/05 | శ్రీ అల్కానంద ఆగ్రోఫామ్స్ లిమిటెడ్ | 669 | 14 | 6 | 4,00,000/- | 4,32,000/- | 11.03.05 | ఒకవారంలో | 03.05.05 |
| 9. | M4/62741/03 | శ్రీ కె. సత్యనారాయణ రాజు | 657 | 4 | 28 | 4,00,000/- | 5,10,000/- | 26.12.04 | 30.12.03 | 07.05.05 |



| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 10. | M4/62742/03 | శ్రీ కాలిచరణ్ మరియు | 678 | 4 | 1 | 4,00,000/- | 4,35,000/- | 26.12.04 | 3 రోజులలోపు | 26.04.05 |
| 11. | M4/9581/04 | శ్రీ ఎ.లక్ష్మయ్య మరియు ఇతరులు | 683 | 8 | 27 | 4,00,000/- | 4,35,000/- | 03.03.04 | 3 రోజులలోపు | 26.05.05 |
| 12. | M4/20078/04 | శ్రీమతి అనూరాధ శ్రీమతి ఎస్. పద్మారెడ్డి | 700 701 | 8 | 0.01 | 4,00,000/- | 4,35,000/- | 15.05.04 | 3 రోజులలోపు | 28.04.05 |
| 13. | M4/20079/04 | శ్రీమతి ఆర్. శ్రీలక్ష్మి | 676 | 4 | - | 4,00,000/- | 4,35,000/- | 15.05.04 | 3 రోజుల లోపు | 29.04.05 |
| 14 | M4/13673/04 | శ్రీమతి ఎం. స్వర్ణ నారాయణ | 713 | - | 685 | 4,00,000/- | 1,58,270/- | 28.07.04 | 3 రోజులలోపు | 27.04.05 |
| | | | | | 817 | 4,00,000/- | 2,32,000/- | 28.07.04 | | |
| 15. | M4/13672/04 | శ్రీ ఆర్.ఎస్. సుదీష్ | 713 | - | 2200 1217 | 4,00,000/- | 2,31,500 | 28.07.04 | 3 రోజుల లోపు | 05.05.05 |
| 16. | M4/13674/04 | శ్రీ టి. సుప్రియ మరియు ఇతరులు | 713 | - | 1217 | 4,00,000/- | 5,20,000/- | 28.07.04 | 3 రోజులలోపు | 06.05.05 |
| 17. | M4/40698/04 | శ్రీ మురళి క్రిష్ణంరాజు | 666 | 13 | 22 | 4,00,000/- | 5,20,000/- | 28.07.04 | 3 రోజులలోపు | 5.05.05. |
| 18. | M4/12766/04 | శ్రీ ఎ. ఎల్లయ్య | 639 | 7 | 22 | 4,00,000/- | | 23.10.04 | 3 రోజులలోపు | 29.04.05. |
| 19. | M4/20823/04 | శ్రీ బి. వెంకటరావు | 708/బి | 1 | 32 | 4,00,000/- | 4,70,000/- | 19.10.04 | 3 రోజులలోపు | 02.05.05 |
| 20. | M4/61931/04 | | 713 | 11 | 10 | 4,00,000/- | 3,50,000/- | 01.01.04 | అర్జంటుగా | 06.05.05 |
| 21. | M4/49928/04 | శ్రీ కె.వి. శ్రీహరి రావు | 713 | 2 | 20 | | | | | 07.05.05 |
| | | | 159 | 16 | 4,00,000/- | | 3,50,000/- | 30.10.04 | ఒక వారంలో | 07.05.05 |

అనుబంధం - 1

# వై.యస్. ప్రభుత్వం చేపట్టిన ప్రాజెక్టుల వివరాలు

| క్ర సం. | ప్రాజెక్టుపేరు | అంచనా వ్యయం (రూ.కోట్లలో) | అంచనా ఆయకట్టు (ఎకరాల్లో) | విద్యుత్ ఉత్పత్తి (ఎందబ్ల్యూ) | క్లియరెన్స్‌లు కేంద్రజల వనరుల సంఘం | పర్యావరణ అనుమతి | పునరావాసం రీ-సెటిల్‌మెంట్ | ప్లానింగ్ కమీషన్ పెట్టుబడి | లబ్ధిపొందే జిల్లాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | తోటపల్లి బ్యారేజ్ | 415.00 | 1,20,000 | – | ఉంది | ఉంది | ఉంది | లేదు | విజయనగరం, శ్రీకాకుళం |
| 2. | జంఝావతి | 69.00 | 24,600 | – | లేదు | లేదు | లేదు | లేదు | విజయనగరం |
| 3. | వంశధార (స్టేజ్-2) | 124.00 | 64,000 | – | ఉంది | ఉంది | ఉంది | ఉంది | శ్రీకాకుళం |
| 4. | పుష్కరం ఎల్.ఐ.ఎస్. | 300.00 | 1,81,168 | – | లేదు | లేదు | లేదు | లేదు | తూర్పు గోదావరి |
| 5. | తాటిపూడి ఎల్.ఐ.ఎస్. | 240.00 | 2,06,000 | – | లేదు | లేదు | లేదు | లేదు | పశ్చిమ గోదావరి |
| 6. | పులిచింతల ప్రాజెక్ట్ | 566.00 | – | 60 | ఉంది | ఉంది | ఉంది | లేదు | కృష్ణా, పశ్చిగోదావరి గుంటూరు, ప్రకాశం |
| 7. | గుండ్లకమ్మ ప్రాజెక్టు | 184.00 | 80,000 | – | లేదు | ఉంది | లేదు | లేదు | ప్రకాశం |
| 8. | రామతీర్థ బ్యాలెన్సింగ్ రిజర్వాయర్ | 43.00 | – | – | లేదు | లేదు | లేదు | లేదు | ప్రకాశం |
| 9. | తెలుగుగంగ (సోమశిల ప్రాజెక్ట్‌తో) | 1821.00 | 6,70,000 | – | ఉంది (సోమశిల) | ఉంది | – | – | కర్నూలు, కడప, నెల్లూరు, చిత్తూరు |
| 10. | గురురాఘవేంద్ర ఎల్.ఐ.ఎస్. | 58.00 | – | – | లేదు | లేదు | లేదు | లేదు | కర్నూలు |
| 11. | కెసిసిఎంపి (కెసి కెనాల్) | 232.00 | – | – | ఉంది | ఉంది | ఉంది | ఉంది | కర్నూలు |
| 12. | జిఎన్ఎస్ఎస్ (గాలేరు -నగరి) | 2,800.00 | 3,25,000 | – | | | | | కర్నూలు,కడప కడప, నెల్లూరు, చిత్తూరు |
| 13. | హెచ్ఎన్ఎస్ఎస్ (హంద్రి-నీవా) | 3,000.00 | 6,02.500 | – | – | – | – | – | కర్నూలు, అనంతపురం, చిత్తూరు |
| 14. | చిత్రావతి బ్యాలెన్సింగ్ రిజర్వాయర్ | 60,00 | 60,000 | – | – | – | – | – | కడప |
| 15. | ఎస్ ఎల్‌బిసి (ఎఎంఆర్ ప్రాజెక్టు) | 635.00 | 2,70,000 | – | – | – | – | – | నల్గొండ |
| 16. | ఎస్.ఆర్.ఎస్.పి (స్టేజ్-2) | 935.00 | 4,40,000 | – | ఉంది | ఉంది | లేదు | లేదు | వరంగల్, ఖమ్మం, నల్గొండ |
| 17. | ఫ్లడ్ ఫ్లో కెనాల్ | 2,421,00 | 2,20,000 | – | ఉంది | ఉంది | – | – | వరంగల్, కరీంనగర్, నల్గొండ |
| 18. | భీమ ఎల్.ఐ.ఎస్. | 1,500.00 | 2,03,000 | – | ఉంది | ఉంది | లేదు | లేదు | మహబూబ్‌నగర్ |
| 19. | కల్వకుర్తి ఎల్.ఐ.ఎస్. | 1,500.00 | 2,50.00 | – | – | – | లేదు | లేదు | మహబూబ్‌నగర్ |
| 20. | అలీసాగర్ ఎల్.ఐ.ఎస్. | 108.00 | | – | ఉంది | ఉంది | ఉంది | లేదు | నిజామాబాద్ |
| 21. | గుత్ప ఎల్.ఐ.ఎస్. | 145.00 | – | – | ఉంది | ఉంది | ఉంది | లేదు | నిజామాబాద్ |

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 22. గోదావరి ఎల్.ఐ.ఎస్. | 900.00 | 1,23,000 | - | ఉంది | లేదు | లేదు | లేదు | వరంగల్, కరీంనగర్, మెదక్, నిజామాబాద్ |
| 23. వెలిగొండ | 1,660.00 | 4,38,00 | - | లేదు | లేదు | లేదు | లేదు | ప్రకాశం |
| 24. నెట్టెంపాడు ఎల్.ఐ.ఎస్. | 50.00 | 27,000 | - | లేదు | లేదు | లేదు | లేదు | మహబూబ్‌నగర్ |
| 25. పి.ఎ.బి.ఆర్. (స్టేజ్-2) | 625.00 | 50,000 | - | - | - | - | - | అనంతపురం |
| 26. పోలవరం | 7,981.00 | 7,20,000 | 960 | లేదు | లేదు | లేదు | లేదు | తూర్పుగోదావరి, పశ్చిమ గోదావరి, విశాఖపట్టణం, కృష్ణా |
| 27. దుమ్ముగూడెం : | | | | | | | | |
| ఎ)హైడ్రో ఎలక్ట్రిక్ స్కీం | 3,166.00 | - | 360 | - | - | - | - | - |
| బి) లిఫ్ట్ ఇరిగేషన్ స్కీం | 3,458.00 | 3,29,000 | - | - | - | - | - | ఖమ్మం |
| 28. ఎల్లంపల్లి బ్యారేజ్ | 4,088.00 | - | - | లేదు | లేదు | లేదు | | వరంగల్, ఖమ్మం, నల్గొండ కరీంనగర్ |
| 29. భూపతిపాలెం | 77.00 | 24,000 | - | - | లేరు | - | - | తూర్పుగోదావరి |
| మొత్తం | 39231 | 5427268 | 2,3554 | | | | | |

**అన్ని క్లియరెన్స్‌లు ఉన్న ప్రాజెక్టులు :** 1) వంశధార స్టేజ్ -2, 2) కెసి కెనాల్, కేంద్ర జలవనరుల సంఘం అనుమతి ఉన్న ప్రాజెక్టులు: 1) తోటపల్లి బ్యారేజ్ 2) పులిచింతల 3) సోమశిల 4) ఎస్.ఆర్.ఎస్.పి స్టేజ్ -2, 5) ఫ్లడ్ ఫ్లో కెనాల్ 6) భీమ ఎల్.ఐ.ఎస్



**అనుబంధం - 2** **పటాన్‌చెరు పారిశ్రామికవాడలోని పరిశ్రమల్లో లోకల్ - నాన్‌లోకల్ ఉద్యోగుల వివరాలు**

| క్రమ సం. | కంపెనీ పేరు | గ్రామం | ప్రస్తుతం పని చేస్తున్న మొత్తం కార్మికులు | పర్మినెంటు కార్మికులు | | కాంట్రాక్ట్ కార్మికులు | | కాంట్రాక్టర్స్ | | కార్యాలయ సిబ్బంది | | టెక్నికల్ సిబ్బంది | | పొల్యూషన్ స్థాయి |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | లోకల్ | నాన్ లోకల్ | లోకల్ | నాన్ లోకల్ | లోకల్ | నాన్ లోకల్ | లోకల్ | నాన్ లోకల్ | లోకల్ | నాన్ లోకల్ | |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 |
| 1. | నోవాపాన్ ఇండస్ట్రీస్ లిమిటెడ్ | పటాన్‌చెరు | 370 | 10 | 150 | 30 | 180 | 4 | - | - | 50 | - | 80 | - |
| 2. | అగ్రానీ టూల్స్ (ప్రై) లిమిటెడ్ | పటాన్‌చెరు | 100 | - | - | - | 100 | - | - | - | 5 | - | 20 | - |
| 3. | వెరిజన్ హైడ్రేర్ (ప్రై) లిమిటెడ్ | పటాన్‌చెరు | 100 | 15 | 45 | | | | | | | | | |
| 4. | మార్క్‌వెల్ హౌజెస్ ఇండస్ట్రీస్ | పటాన్‌చెరు | 242 | 28 | 14 | 80 | 120 | 1 | - | 6 | 44 | 8 | 12 | - |
| 5. | టీమ్ ఏసియా లఖి సెమి కండక్టర్స్ లిమిటెడ్ | పటాన్‌చెరు | 500 | 20 | 100 | 100 | 100 | - | - | 30 | 40 | | | |
| 6. | యల్.యస్. పాలిస్టర్స్ లిమిటెడ్ | పాటి ఘన్‌పూర్ | 325 | - | 25 | - | - | - | 10 | - | 12 | - | 6 | ఎక్కువ |
| 7. | రిలయన్స్ సెలియస్ ప్రొడక్ట్ లిమిటెడ్ | పటాన్‌చెరు | | | | | | | | | | | | |
| 8. | రాలీస్ ఇండియా లిమిటెడ్ | పటాన్‌చెరు | 337 | 80 | 57 | 200 | 200 | 3 | - | 3 | 116 | 50 | 100 | నార్మల్ |
| 9. | ఏసియన్ పెయింట్స్ ఇండియా లిమిటెడ్ | పటాన్‌చెరు | 1550 | 680 | 400 | 200 | 350 | 2 | 3 | 20 | 175 | - | - | - |
| 10. | బయాలాజికల్ - ఇ - లిమిటెడ్ | పటాన్‌చెరు | 750 | 225 | 300 | 105 | - | 2 | - | 30 | 290 | - | - | - |
| 11. | బి.యం.ఎఫ్. బెల్టింగ్ లిమిటెడ్ | పటాన్‌చెరు | 202 | 70 | 92 | 25 | 15 | 1 | - | 12 | 36 | 4 | 6 | - |
| 12. | పెనో ప్లాస్ట్ (ప్రై) లిమిటెడ్ | పటాన్‌చెరు | 250 | 10 | 60 | 250 | - | 1 | - | - | 15 | - | 6 | నార్మల్ |
| 13. | పెన్నార్ ఇండస్ట్రీస్ లిమిటెడ్ | పటాన్‌చెరు | 320 | 20 | 160 | 45 | 95 | - | 6 | 3 | 27 | 5 | 25 | - |
| 14. | సురానా ట్యూబ్స్ లిమిటెడ్ | పటాన్‌చెరు | 150 | 40 | 60 | 120 | 30 | - | 2 | - | 40 | - | 40 | నార్మల్ |
| 15. | టుబెక్స్ టుబింగ్స్ లిమిటెడ్ | పటాన్‌చెరు | 15 | - | - | - | 1 | - | 1 | - | - | - | - | నార్మల్ |
| 16. | విడియ ఇండియా లిమిటెడ్ | పటాన్‌చెరు | 210 | 20 | 140 | 20 | 30 | | 1 | 2 | 10 | 5 | 60 | నార్మల్ |
| 17. | పెనో ప్లాస్ట్ (ప్రై) లిమిటెడ్ యూనిట్ - 1 | సందిగామ | 70 | 25 | 15 | 50 | 20 | | 5 | | 10 | 2 | 13 | |
| 18. | పెనో ప్లాస్ (ప్రై) లిమిటెడ్ యూనిట్ - 2 | సందిగామ | 250 | 10 | 25 | 150 | 100 | 1 | | | 12 | | 6 | నార్మల్ |
| 19. | అరబిందో ఫార్మా లిమిటెడ్ | పి. మైలారమ్ | 2000 | 25 | 335 | 250 | 1500 | 4 | 8 | | 120 | 12 | 70 | |
| 20. | మాట్రిక్స్ లాబరేటరీస్ లిమిటెడ్ | పి.మైలారమ్ | 200 | 4 | 9 | 90 | 110 | 1 | 1 | 10 | 70 | 2 | 13 | నార్మల్ |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 21. | న్యూలాండ్స్ లాబరేటరీస్ లిమిటెడ్ | పి. మైలారమ్ | 400 | 40 | 210 | 30 | 150 | 1 | - | 4 | 26 | | | ఎక్కువ |
| 22. | నిత్య లాబరేటరీస్ లిమిటెడ్ | పి. మైలారమ్ | 270 | 10 | 28 | 200 | 15 | 3 | | 2 | 13 | 2 | 8 | ఎక్కువ |
| 23. | బి.హెచ్.ఎల్. ఇంజనీరింగ్ లిమిటెడ్ | పి. మైలారమ్ | 425 | 20 | 130 | 50 | 250 | | 2 | 5 | 75 | 8 | 17 | నార్మల్ |
| 24. | కిర్బి బిల్డింగ్ సిస్టమ్ లిమిటెడ్ | పి. మైలారమ్ | 600 | 40 | 120 | 200 | 250 | 1 | 1 | | 45 | 7 | 18 | |
| 25. | హిందుస్థాన్ కోక కోలా బ్రేవరీస్ (ప్రై) లిమిటెడ్ | అమీన్‌పూర్ | 700 | 12 | 450 | 100 | 600 | 0 | 3 | | 100 | | 70 | నార్మల్ |
| 26. | భారత్ డైనమిక్ లిమిటెడ్ | భానూర్ | 175 | 130 | 270 | 130 | 45 | 3 | 18 | | 100 | 50 | 100 | నార్మల్ |
| 27. | జిటిఎస్ టెక్స్‌టైల్స్ డబ్లింగ్ లిమిటెడ్ | చిట్కుల్ | | 70 | 92 | | | | | | 10 | 1 | | |
| 28. | జిటిఎస్ టెక్స్‌టైల్స్ లిమిటెడ్ | చిట్కుల్ | 750 | 150 | 200 | 180 | 220 | 4 | | 50 | 135 | 10 | 20 | |
| 29. | అరబిందో ఫార్మా లిమిటెడ్ యూనిట్ - 6 | చిట్కుల్ | 250 | | | 150 | 100 | 3 | 4 | 10 | 30 | 10 | 50 | |
| 30. | జెమ్ కేబుల్స్ కండక్టర్స్ (ప్రై) లిమిటెడ్ | చిట్కుల్ | | | | 70 | 30 | 2 | | | | | | |
| 31. | అన్నపూర్ణ ఫాయిల్స్ లిమిటెడ్ | కొల్లూర్ | 300 | 50 | 170 | 25 | 55 | | 4 | 10 | 30 | 5 | 35 | |
| 32. | అల్కటీర్ ఎక్స్‌పోర్ట్స్ లిమిటెడ్ | రుద్రారం | 2323 | 200 | 323 | 100 | 700 | 8 | 10 | 60 | 140 | 50 | 100 | ఎక్కువ |
| 33. | హిందుస్థాన్ ఫ్లోరో కార్బన్స్ లిమిటెడ్ | రుద్రారం | 241 | 107 | 134 | 33 | | 1 | | 3 | 30 | 38 | 105 | |
| 34. | నిటిక్ ఫెర్రో అల్లాయిస్ లిమిటెడ్ | రుద్రారం | 360 | 90 | 70 | 150 | 50 | 3 | | | 30 | | 20 | ఎక్కువ |
| 35. | ఐటిడబ్ల్యు సిగ్నోడు ఇండియా లిమిటెడ్ | రుద్రారం | 240 | 50 | 130 | 40 | 20 | 2 | 3 | | 30 | | 25 | |
| 36. | విజయ్ ఎలక్ట్రికల్స్ లిమిటెడ్ | రుద్రారం | 1300 | 50 | 500 | 500 | 250 | 2 | | 10 | 90 | 20 | 380 | |
| 37. | ఆర్డినెన్స్ ఫ్యాక్టరీ ప్రాజెక్టు | వై. మైలారమ్ | 5000 | 3000 | 2000 | 400 | 150 | 14 | 5 | | | | | |
| 38. | యం.ఆర్.ఎఫ్. లిమిటెడ్ | సదాశివపేట | 1900 | 900 | 550 | 1400 | 4 | 25 | 50 | | 200 | | 200 | నార్మల్ |
| 39. | గణపతి షుగర్స్ ఇండస్ట్రీస్ లిమిటెడ్ | ఫసల్‌వాడి | 500 | 370 | 75 | 150 | | 1 | | 20 | 40 | | | |
| 40. | హిమ్మత్ (కిల్లి) | పి. మైలారమ్ | 360 | | 180 | 140 | 40 | 5 | 2 | 10 | 2 | 4 | 11 | |
| 41. | మారుతి టెక్స్‌టైల్స్ లిమిటెడ్ | పి. మైలారమ్ | 220 | | | 40 | 180 | 1 | 4 | 2 | 18 | 4 | 26 | |
| 42. | సిఎస్‌టి | ఇస్నాపూర్ | 90 | 4 | 31 | 20 | 30 | 1 | | | 18 | 4 | 11 | |
| 43. | కన్యక పరమేశ్వరి | రుద్రారం | | | | 120 | 30 | 7 | 3 | 30 | 20 | | | |
| 44. | జూపిటర్ లిమిటెడ్ | వేర్యాల | 20 | | | | 20 | | | 10 | 90 | | | నార్మల్ |
| 45. | బెన్సన్ లిమిటెడ్ | పటాన్‌చెరు | 70 | 5 | 20 | 30 | 50 | 1 | | 15 | 45 | 30 | 50 | |
| 46. | మెట్రో పెరల్ | పటాన్‌చెరు | 180 | 20 | 10 | 80 | 70 | 5 | | 2 | 30 | 7 | 3 | |
| 47. | సురక్ష లిమిటెడ్ | పటాన్‌చెరు | 130 | | | 90 | 40 | 1 | | 3 | 7 | 3 | 3 | |



| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 48. | స్వస్తిక్ గ్రానైట్ | పటాన్‌చెరు | | | | 12 | 18 | | 1 | | | | 4 | |
| 49. | ప్రెక్సర్ గ్యాస్ లిమిటెడ్ | పటాన్‌చెరు | 25 | | | 20 | 15 | | | | 10 | | 10 | |
| 50. | పిటిఎల్ లిమిటెడ్ | పటాన్‌చెరు | | | | 40 | 30 | | | 1 | 9 | 2 | 4 | ఎక్కువ |
| 51. | బి.ఇ. లిమిటెడ్ | పటాన్‌చెరు | 110 | 40 | 70 | | | 1 | | 3 | 47 | 2 | 13 | |
| 52. | బి.ఇ. హెల్త్ ప్రొడక్ట్ | పటాన్‌చెరు | 75 | | | 30 | 45 | 1 | | 5 | 15 | 3 | 9 | ఎక్కువ |
| 53. | రూప ఇండస్ట్రీస్ | పటాన్‌చెరు | 60 | | | 30 | 30 | 1 | | | 10 | 3 | 3 | ఎక్కువ |
| 54. | శివాని అలాయిస్ | పటాన్‌చెరు | 60 | | | 30 | 30 | 1 | | | 10 | | 6 | |
| 55. | డెక్కన్ లెదర్స్ | పటాన్‌చెరు | 155 | 16 | 19 | 70 | 50 | 1 | | 7 | 15 | 5 | 2 | |
| 56. | సుమల్ ఇంజనీరింగ్ (ప్ర) లిమిటెడ్ | పటాన్‌చెరు | | 8 | 2 | | | | | | | | | |
| 57. | డైమండ్ ప్లాస్టిక్స్ | పటాన్‌చెరు | | | 35 | | | | | 3 | 3 | | | |
| 58. | రిలైయబుల్ పేపర్ మిల్ | పటాన్‌చెరు | | | | 20 | 50 | | 1 | 4 | | | | |
| 59. | నవనీర్ ఫ్లోరమిల్ | పటాన్‌చెరు | | 2 | 48 | | | | 1 | | 5 | | 4 | |
| 60. | షాలిమార్ ఫ్లోర్ మిల్ | పటాన్‌చెరు | | 2 | 58 | | | | | | 5 | | 4 | |
| 61. | తిరుపతి ఫ్లోర్ మిల్ | పటాన్‌చెరు | | 4 | 51 | | | | 2 | | 8 | | 3 | |
| 62. | ఒయాసిస్ ఎక్స్‌చేంజ్ లిమిటెడ్ | పటాన్‌చెరు | 70 | 6 | 24 | 40 | | 2 | | 4 | 16 | 4 | 1 | |
| 63. | ఎస్.ఎస్.ఎఫ్. ఇండియా లిమిటెడ్ | పటాన్‌చెరు | 30 | 12 | 8 | 1 | 9 | | 1 | 2 | 4 | 4 | 2 | |
| 64. | నాడిలాల్ గ్యాస్ కెమికల్ | పటాన్‌చెరు | 14 | | 14 | | | | | | 3 | | 2 | |
| 65. | ఆగ్రెల్ హెవీ ఇంజనీరింగ్ లిమిటెడ్ | పటాన్‌చెరు | 70 | 25 | 25 | 20 | | | 1 | 5 | 3 | 3 | 5 | |
| 66. | ఫెర్రో ఇన్సులేషన్ | పటాన్‌చెరు | 12 | | | 12 | | | 2 | | 2 | | 2 | |
| 67. | డెక్కన్ డ్రగ్స్ లిమిటెడ్ | పటాన్‌చెరు | 46 | 10 | 36 | | | | | 4 | 8 | 4 | 4 | |
| 68. | మంజీర మెషీన్ బిల్డర్స్ | పటాన్‌చెరు | 40 | 20 | | 20 | | | | | 6 | | 12 | |
| 69. | చంద్ర కంటేయినర్స్ | పటాన్‌చెరు | 90 | 10 | 60 | 12 | 8 | | | | 5 | 10 | 20 | |
| 70. | కోరమండల్ ప్రెస్టీక్రీట్స్ | పటాన్‌చెరు | 116 | 12 | 4 | 100 | | 4 | | 10 | | 1 | | |
| 71. | కార్లోడియానోటెక్ | పటాన్‌చెరు | | 10 | 5 | | | | | 3 | 1 | 3 | | |
| 72. | గురు రాజ ప్రింటింగ్ ఇండస్ట్రీస్ | పటాన్‌చెరు | 50 | 20 | 30 | | | | | 2 | 8. | 2 | 2 | |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 73. | హైదరాబాద్ హై-టెక్ ఇంజనీరింగ్(ప్రై)లిమిటెడ్ | పటాన్‌చెరు | 30 | 10 | 20 | | | | | | 5 | | 4 | |
| 74. | కీమాస్ ఇంజనీరింగ్ | పటాన్‌చెరు | | 1 | 14 | | | | | | 1 | | | |
| 75. | ఎస్.ఎస్. పైప్ ఫిట్టింగ్ | పటాన్‌చెరు | – | 4 | 11 | | | | | | 3 | | | |
| 76. | అరీన్ లైఫ్‌సైన్ | పి. మైలారమ్ | | | | 4 | 11 | | | | 6 | | 8 | |
| 77. | సత్యదేవ ఫార్మ | పి. మైలారమ్ | | | | 6 | 11 | 1 | | 3 | 7 | | | నార్మల్ |
| 78. | సిగాచి క్లోరైడ్ లిమిటెడ్ | పి. మైలారమ్ | | 2 | 6 | 6 | 9 | | | 1 | 4 | | 2 | |
| 79. | తేజస్వీ ఇంటర్‌మీడియేట్ లిమిటెడ్ | పి. మైలారమ్ | | | | 7 | 3 | | 1 | | 6 | | 2 | నార్మల్ |
| 80. | వెంకట్ కెమికల్స్ | పి. మైలారమ్ | 26 | 6 | 8 | 8 | 4 | 1 | | | 8 | 2 | 4 | నార్మల్ |
| 81. | ఆర్జిన్ లాబరేటరీస్ | పి. మైలారమ్ | | | | 16 | 4 | | | | 4 | | 2 | |
| 82. | మధురా ఎక్స్‌పోర్ట్స్ | పి. మైలారమ్ | | | | 12 | 28 | 1 | | | | | | |
| 83. | జై మహిమ కెమికల్స్ | పి. మైలారమ్ | | | | 6 | 14 | 1 | | | | | | |
| 84. | శివగంగ సిమెంట్స్ | పి. మైలారమ్ | 13 | 2 | 3 | 4 | 4 | | | | 3 | | 1 | నార్మల్ |
| 85. | శతాబ్ది గ్రానైట్స్ | పి. మైలారమ్ | | | | | 20 | | | | | | | |
| 86. | అభినవ గ్రానైట్స్ | పి. మైలారమ్ | | | | | 15 | | | | 2 | | | |
| 87. | శ్రీ సాయి స్టోన్స్ ప్రాసెసర్స్ | పి. మైలారమ్ | | | | | 12 | | | | 2 | | | |
| 88. | సాయి పృథ్వీ గ్రానైట్స్ | పి. మైలారమ్ | | | | 4 | 11 | | | | 2 | | | |
| 89. | మ్యాకాన్ ఇంజనీరింగ్ లిమిటెడ్ | పి. మైలారమ్ | 70 | 8 | 12 | | 50 | | | 2 | 2 | | | |
| 90. | ఆస్పామ్ కార్బన్ లిమిటెడ్ | పటాన్‌చెరు | 175 | 80 | 95 | | | | | | 75 | | | నార్మల్ |
| 91. | ఎ1 ఆర్గానిక్స్ | యూసాపూర్ | 200 | 35 | 70 | 150 | 50 | 2 | 3 | 5 | 75 | 4 | 16 | ఎక్కువ |
| 92. | ఎస్.ఎస్. ఆర్గానిక్స్ | ఆరూర్ | 200 | 35 | 65 | 110 | 40 | 1 | 3 | 10 | 42 | 5 | 9 | ఎక్కువ |
| 93. | ప్రియదర్శిని | సదాశివపేట్ | 2500 | 225 | 125 | 1100 | 400 | 2 | 6 | 35 | 65 | 9 | 25 | ఎక్కువ |
| 94. | తిమ్మయ్య మెటల్ ఇండస్ట్రీస్ | పటాన్‌చెరు | 100 | 6 | 4 | 90 | | | | 4 | | 1 | 2 | |
| 95. | సదరన్ సిలిండర్స్ లిమిటెడ్ | ఇస్నాపూర్ | 80 | 10 | 20 | 20 | 30 | | 4 | 3 | 8 | 2 | 6 | |
| 96. | యునిక్ మెటల్ ప్రాసెసర్స్ | ఇస్నాపూర్ | 30 | | 10 | 4 | 16 | | 3 | 2 | 10 | 1 | 8 | |